శ్రీరామాయనమః

సంఖ్య:- 35

# పురవర్ణనము.

శ్రీభద్రాచల పురవర్ణనము
ఇత్యాది

శ్రీ భద్రాచల సీతారామచంద్ర మహాప్రభువారి

యాస్థాన విద్వాంసుడగు

## వేదాంతం శ్రీరామశాస్త్రిగారిచే

రచియింపబడి

కృతిపతి

భద్రాచలములో పోలీసు డిప్యూటీ సూపరెంటెండెంటు

## నుసర్ల సత్యనారాయణ గారిచే

ప్రకటింపబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు,

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల ముద్రితము.

కాకినాడ.

1931

ఈ గ్రంథ రచయిత సుపత్రి యజ్ఞనా
రాయణ గారా లేక గ్రంథకర్త వారిచే
వ్రాయబడెను —>

శ్రీ గణేశాయ నమః

# కృతిసమర్పణము.



శ్రీమాన్ ధీమాన్ యశస్వీ ద్విజకుల కలశాంభోధి రాకాశశాంకః ।
శ్రీ సుబ్రహ్మణ్య విద్వన్మణి కృతతపసాం పుత్రరూపో విపాకః ।
సౌమ్యత్వేనా ద్వితీయ స్సుసరళకులజ స్సత్యనారాయణాఖ్యో ।
భద్రాద్ర్యారక్షకేశ స్సుజని విబుధానాం ద్వారమందారకల్పః ॥ 1

తాత్పర్యము: శ్రీమంతుడును, బుద్ధిశాలియు, నతిసౌమ్యుడును, పండితుల గౌరవించుచు కీర్తినొందినవాడును, సుసర్ల సుబ్రహ్మణ్య శాస్త్రులవారి కుమారుడును నగు సత్యనారాయణ యను మహాశయుడు భద్రాద్రిలో పోలీసుల యధికార డిప్యూటీ సూపరింటెండెంటు యాయెను.

నైతచ్చిత్రం భవతియదయం సత్యనారాయణాఖ్యో ।
భద్రారక్షాధిపతి పదవీం భద్రశైలే భునక్తి ।
ఆశంసంతే పరిఘ యుగళీ పద్మపత్రాభిరామాః ।
తస్యార్హత్వం సకల జగతీ ధారణే నేత్రబాహాః ॥ 2

తా॥ పెద్దపెద్ద తలుపుల గడియలవలె పొడవులగు చేతులును, తామర రేకులవంటి కన్నులును, నీతడు మహారాజు కాదగునని దెల్పుచుండ నీపాటి యధికార మీతనికి గల్గుట యొక చిత్రమా ?

సుసరలకుల సింధౌ సత్యనారాయణాఖ్యః ।
కువలయహిత కర్తా జగ్మివా న్నూత్నచంద్రః ।
జనయతి ననుచిత్రం తస్య సంకోచభావం ।
పరయువతి ముఖాబ్జం దర్శనాల్లబ్ధకాంతి ॥ 3

తా॥ కువలయహితకర్తయై పరస్త్రీ ముఖపద్మమును వికసింప చేసియును, తాను దాని జూచి సంకోచము నొందును గాన నీతడు సుసర్ల కులమను సముద్రమున బుట్టిన నూతన చంద్రుడు. (ఈతడు పరస్త్రీ పరాఙ్ముఖుడును, భూవలయమునకు మేలు చేయువాడును, సుందరుడును.)

చక్రే పద్మశతే నయస్య జనక స్తోత్రం హరేస్సూరిరాట్ ।
ధీరాణాం జననీ త్రిలోకవిదితా వాసస్థలీ బొబ్బిలీ ।
తర్క వ్యాకృతి ముఖ్యశాస్త్ర గురవః ఖ్యాతాశ్చయత్పూర్వజాః ।
ఆయుష్మాన్ భవతాచ్చిరం సుసరల శ్రీ సత్యనారాయణః ॥ 4

తా॥ ధీరజనని యగు బొబ్బిలి యీతని కాపురము. వీరి పూర్వులు తర్క వ్యాకరణాది శాస్త్రముల జదివినవారు. బొబ్బిలి యాస్థాన కవియై వీరి తండ్రి హరిశతకమును రచించెను.

అస్మాదభ్యుదయోధి కోస్తు విదుషామాశీర్విశేషాద్ధరా ।
భక్తిర్భద్రగిరీంద్ర మస్తకతురాషాడ్రత్న భూషాయితే ।
ఆయుష్మత్సుగుణాన్వితై స్సుతనయైశ్యక్తోస్తు వాసస్సదా ।
శ్రీమన్నస్తు శుభం తవేహ సతతం భోస్సత్యనారాయణ ॥ 5

తా॥ సుసర్ల సత్యనారాయణ మహాశయా! పండితుల యాశీః ప్రభావమువలన నిప్పటికంటె నెక్కువయగు నభ్యుదయమును, శ్రీరాముని యందు భక్తియు, నాయుష్మత్సుగుణానేక సుపుత్రావాప్తియు, శుభసంతతియు నీకు కలుగుగాక!

ఇత్యాశీర్వినియుజ్య భద్రగిరిరా డాస్థాన ధీరేణ స ।
ద్వేదాంతాన్వయ శేష పండితతనూజాతేనయద్వర్ణనం ।
భద్రాద్రేః కృతమేతదర్పితమ భూచ్ఛ్రేయః కృతే చద్వయోః ।
శ్రీరామేణ తదిచ్ఛయా సుసరల శ్రీ సత్యనారాయణే ॥ 6

తా॥ అని యాశీర్వదించి వేదాంతం, శేషపండితుని కుమారుడును, భద్రగిరీశుని యాస్థాన పండితుడు నగు శ్రీరామశాస్త్రి యుభయుల కీర్తికొఱకును తా రచించిన భద్రాద్రిపురవర్ణనమను కృతి సుసర్ల సత్యనారాయణ మహాశయుని కోరికవలన వారి కిచ్చెను.

త్రిభూతాష్టచంద్రాత్మ కే శాలి వాహే ।
ప్రజోత్పత్తివర్షే తు శ్రావణాభిఖ్యమాసే ।
దశమ్యాం వళక్షేఽర్కివారేఽర్పితేయం ।
కృతిశ్శ్రీసుమతే సత్యానారాయణాయ ॥ 7

తా॥ 1853 శాలివాహనశకమున ప్రజోత్పత్తి శ్రావణశుద్ధ దశమి శనివారమున నిచ్చెను.

యస్యాం నాథస్సుసరల కులోద్భూత విద్యాస్వరూప ।
సంపద్యుక్తోఽపిభురపి యువా సత్స్వభావోఽనుకూలః ।
కన్యాధన్యాఖలు జగతిసా తాత వాచాశ్చతస్యాః ।
తద్ధన్యాస్సీన్మమకృతి సుతా నాయకేనేదృశేన ॥ 8

తా॥ సుసరల కులోత్పన్నుడై, విద్యారూపసంపదాదులుగలిగి, యనుకూలుడగు పడుచుమగడుగల కన్యధన్యగాన, నీ కృతికన్యయు నట్టి పతినూరిమున ధన్యయాయె. దాని గన్నయాతడును ధన్యుడు.

కృతా యతో విప్రవరేణ కన్యకా ।
కృతేః కవిస్సంప్రతి వీతహృద్వ్యథః ।
విధాతృసృష్టౌ బహుశోఽపిచారణే ।
సురూపయోస్సంఘటనం హి దుర్లభం ॥ 9

తా॥ తన కృతికన్య విప్రవరునిచే వరింపబడె గాన నిప్పుడీకృతి కర్తకు దిగులుదీరెను. ప్రపంచమున మంచి యన్నమునకు మంచి కూర గొరుకుట దుర్లభము గదా?

---

# శ్రీ భద్రాచలపురవర్ణనము.



## ఇష్టదేవతాప్రార్థన.

వేదాంతోనిలయోబభూవ విదితో యస్యాన్నపూర్ణాప్రియా ।
శ్రీరామేతిచనామయస్య మధురం యస్తస్య సేవ్యోప్యభూత్ ।
అద్వైతం విదితం యదీయమవనౌ విద్వద్భిరామోదితం ।
సస్యాత్ సంతతమోదితాఖిల బుధఃశ్రేయసా యోర్జితః ॥ 1

తా॥ వేదాంతనిలయుడై అన్నపూర్ణాప్రియుడై శ్రీరామనామమును చవిజూచుచు, శ్రీరామసేవ్యుడై సకల బుధామోదకుడై విద్వదామోదితాద్వైతోర్జితుడగు నాదేవుడు శుభమొడగుగాక. (ఇందు వేదాంతం శ్రీరాముడని తనపేరును, అన్నపూర్ణయని తనభార్యపేరును, తన మత మద్వైతమనియు శివుడును, రాముడును, తనకు సేవ్యులనియు, కవి సూచించెను.)

---

# కథాప్రారంభము.



## —◆ విప్రదంపతుల సంవాదము. ◆—

కశ్చిద్విప్రశ్చరిత సుకృతస్తీర్థయాత్రామటిత్వా ।
తత్తద్దేశస్థిత వివిధసత్సేవయా తృప్తచిత్తః ।
పత్న్యాసాకం స్వయమపిమహాతీర్థసేవాంచికీర్షో ।
రప్యభ్యర్ణం శిశుసుత తయోఽగాత్ స్థితాయాః ప్రియాయాః ॥ 2

తా॥ పుణ్యాత్ముఁడగు నొకవిప్రుడు తీర్థయాత్రలసేవించి తనతోడ రాదలచినను పసిపిల్లల తల్లియగుటచే రాలేక ఇంట నిలచిన తన భార్య వద్దకు మఱలి వచ్చెను.

దృష్ట్వాయాత్రా కృశమతితరాం దూయమానా స్వనాథం ।
ద్వారే సద్యఃకలశసలిలైః క్షాళయిత్వా పవిత్రౌ ।
సత్యఃపాదౌ ధృతపదజలా ప్రీతి పూర్వాం గృహాంత ।
ర్నీత్వా భోజ్యైర్ద్రుత విరచితైర్భోజయామాసకాంతా ॥ 3

తా॥ తీర్థోపవాసాదులచే గృశించిన భర్త నాసతి చూచి కృశించినందుకు మనమున వ్యథనొందుచు వాకిటనే పతిపాదముల గడిగి శిరమున ధరించి సంతసమున లోనికిం గొనిపోయి త్వరగా వంటచేసి భుజింపచేసెను.

మార్గశ్రాంతం ప్రియమథ సతీ వీజయిత్వాశయానం ।
ద్రాణేఽస్మిన్ స్వయమపి స్వతైర్భోజనం సాచకార ।
సాయంభూయః పతిసుతకృతే పాకవర్గం విధాయ ।
నాథం పుత్రానపి ద్రుతతరంభోజయామాససాధ్వీ ॥ 4

తా॥ మార్గశ్రాంతుడైవచ్చిన పతి భుజించి పరుండగా నిద్రిం బోవునరకు విసరి యాసతిసుతులతో సాపడి సాయంకాలమున మెందలకడ వంటచేసి పతిసుతులకు బెట్టెను.

భుక్త్వా శీఘ్రం స్వయమపిసతీ గేహరక్షాం విధాయ ।
శయ్యాగారే లలితలలితే భర్తురంకే నిషణ్ణా ।
యుక్తా చూర్ణం ఛదనకలితం కుర్వతీదాడ్రిమశంతీ ।
ర్భర్తుర్హస్తే మృదుమధురయా వాక్యపా కాం తంగిరాసా ॥ 5

తా॥ తానును దిని శీఘ్రముగ నిల్లు చక్కబెట్టుకొని పడకటింటిలో పతివద్ద గూర్చుండి యాకుమడుపులందిచ్చుచు మృదుమధుర వాక్కుల నాసతి యిట్లనె.

నూనం జన్మాంతరసుచరితైః ప్రాప్యతే పుంస్త్వమస్మాత్ ।
కష్టం యుష్మద్విధజననతానాథ యద్యూయమేవం ।
జ్ఞాత్వా తత్త్వం సకలనిగమస్తోమ సారం చరంతి ।
దృష్టాంతార్థం సకలజగతీ తీర్థయాత్రాం మహాత్మన్ ॥ 6

తా॥ నాథా! ఎంతపుణ్యమో చేసినగాని పురుషుడై పుట్టడు. సకలశాస్త్రసారము నెఱిగి లోకదృష్టాంతమునకై మీవలె సకల తీర్థయాత్రల సేవించువారగుటకు ఎంతపుణ్యము చేయవలెనో గదా?

స్త్రీణామూనం పశుజననతో జన్మనూనం యతోనః ।
పుణ్యాం వేదైర్విహితమపి తత్కర్మనో కర్తుమాజ్ఞా ।
తాస్వప్యస్మజ్జనిరతి తరాం శోచనీయా యతో హా ।
తీర్థస్నానాచరణ విరతం నానుయాతా భవంతం॥ 7

తా॥ పురుషులకున్నట్లు స్త్రీలకు కరచరణాద్యవయవములన్ని యున్నను వేదోక్తకర్మల జేయుటకు స్త్రీకధికారము లేనందున పశువులకన్న స్త్రీల జన్మ తక్కువదని తలచెదను. అందును తీర్థయాత్రల సేవింపబోవు మీ వెంటనంటియుండని నా జన్మము మరియు శోచనీయము.

ఇత్థం దీనం ద్విజకులవరః కుత్సయంతీం స్వజన్మ ।
న్యాయ్యైర్వాక్యైరపగతశుచం తాం చికీర్షుస్స్వజాయాం ।
ఏవం శాస్త్రగ్రథితసరణిం వాచమూచేఽతిరమ్యాం ।
స్మిత్వా పూర్వం యువతిజనతాయోగ్యతాం బోధయిష్యన్ ॥ 8

తా॥ అని తనను గర్హించుకొను ప్రేయసిని న్యాయ్యములగు వాక్యములచే నూరడింపదలచి ముందుగ స్త్రీజన్మమే మంచిదని చెప్పబోవుచున్నందున చిరునవ్వుతో శాస్త్రసమ్మతముగ నిట్లనె.

భ్రామ్యద్భృంగభర డింభ సన్నిభ లసద్వేణీభరే! మత్ప్రియే! ।
నైవం యద్భవతీ సతీ జనజనిం హీనామలం మన్యసే ।
నూనం తీర్థవిశేషగాహనపరా బ్రూహీహ విచార్యైవమాం ।
చారిత్రం నను గౌరవాస్పదమలం స్త్రీణాం నలింగం కులం ॥ 9

తా॥ ప్రేయసీ ! సరిగా విచారింపక స్త్రీజన్మము హీనమనుకొంటివి. తీర్థయాత్రల జేయుకపోతిగదా యను పశ్చాత్తాపముతో నిట్లంటివి గాన నడతచేతనే గొప్పతనముగలుగును. గాని, మగతనమువలన గాని, యాడుది యగుటవలనగాని కులమువలనగాని కాదు.

యచ్చాజ్ఞానహి వేదశాస్త్రవిహితం కర్తుం వధూనామితి ।
బ్రూషేసుందరి సుందరం నహి వచస్తచ్చాపి వక్ష్యేశృణు ।
యాత్సాధ్యం పురుషస్య వేద విహితా చారేణ పుణ్యం మహత్ ।
నారీసాధయతిహ్యవశ్య గృహిణీ కృత్యేన కష్టంవినా ॥ 10

తా॥ ఓ సుందరీ ! స్త్రీలకు వేదోక్త కర్మాధికారము లేదంటివే యదియు సరికాదు. ఏలన ? వినుము. పురుషుడు ఆకర్మలజేసి సంపాదించు పుణ్యమును, చేసికొనకతీరని ఇంటిపనుల జేసికొనియే యాడుది సంపాదించును.

సావిత్రీ కిముసప్తతంతు కరణా ద్భర్తారమాపాంతకాత్ ।
నస్త్రీ కిం భువనత్రయ ప్రణుతా సారుంధతీమ్యత్ప్రియే ।
బ్రహ్మాదీన్ శిశుతాం నినాయవనితాప్యత్రేః కే నవాకర్మణా ।
స్త్రీత్వం తన్నహి నిందనీయ మథవా పుంస్త్వం న పూజాస్పదం ॥

తా॥ సావిత్రి యజ్ఞముజేసి నే పతిని యమునివలన విడిపించుకొనెనా ? ముల్లోకములచే నమస్కరింపబడు నరుంధతి స్త్రీకాదా ? అనసూయ ఏమితపముజేసి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పసిపిల్లలజేయగలిగెను ? కాన నాడుది తక్కువదియు కాదు. మగవాని ఎక్కువము లేదు.

పుంభిః కృచ్ఛపరాకసాంత పనస చాంద్రాయణాద్యైః ప్రియే ।
ప్రాణాయామ ముఖైస్సమాధి సహితై రష్టాంగయోగై రపి ।
కృచ్ఛేణార్జిత పుణ్యసంచయ మమూః కష్టం వినైవస్త్రీయః ।
స్వాత్మాపత్యకృతేకృతే నలఘు నాపాకాది నాంచంతితత్ । 12

తా॥ కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములచే కష్టపడి మగవాడు గడించు పుణ్యమును, స్త్రీ తనకును పిల్లలకును కావలసి చేసుకొను గృహకృత్యములతో సులభముగనే పొందును.

యస్మాత్త్వం గృహిణీతతః పురుష వత్త్యక్తుం నయుక్తంగృహం।
తేత్రస్మాదను యానమప్యతితరాం దోషాయముగ్ధేనుమ।
బాలాపత్యతయాత్వ మ్నతిసదనేస్థిత్వాతిథీన్ కుర్వతీ।
ప్రీతాత్మత్కృత పుణ్యకర్మణి ఫలం నూనం తదప్యర్హసి॥ 13

తా॥ మఱియు నాతోడ రానందున నీవు వ్యర్థురాలననుకొంటివి. అదియును పొరపాటే. ఏలన? నీవు గృహిణివి. (అనగా యిల్లుకలదానవు) కాన మగవానివలె యిల్లు వదలగూడదు. కాన నీవు నాతోవచ్చిననుతప్పే ఇంట నున్నందుననే విశేషము కలదు. పసిపిల్ల తల్లివైనందున నీ యింటనుండి యతిథుల బూజించుచు పుణ్యము సంపాదించి నే జేసిన తీర్థయాత్రవలన గలిగిన పుణ్యమును సైతము పంచికొంటివి.

ఏవం భర్త్రాఽఽశ్వాసితా సాహ భూయః।
స్వామిన్ క్షేత్రం కీదృశం నామతీర్థం।
యస్మాల్లోకే తీర్థయాత్రేతివార్తా।
భూయోలబ్ధా క్షేత్రయాత్రేతినోవై॥ 14

తా॥ అని పతి యూరడింప నా సతి మరల ప్రాణనాథా! తీర్థయాత్ర యన్నందున జ్ఞాపకము వచ్చినది. తీర్థమన నేమి? క్షేత్ర మన నేమి? తీర్థయాత్ర యందురు కాని క్షేత్రయాత్ర యనరు. అని యడిగెను.

శుంభ త్కుంభపయోధరే ప్రియతమే యక్తో నుయోగస్తవే।
త్వస్తోక ప్రియభాషణై రతితరాం సంశ్లాఘుయన్న్యాసురః।
తామాహప్రియభాషిణీం ప్రియతమాం క్షేత్రం విదుఃఖ్యాతలం।
తత్తత్కారణ తస్వయం భగవతోఽచార్ విగ్రహాస్యాస్పదం॥ 1

తా॥ అని యడిగిన తన సతిని బాగుబాగని కొనియాడుచు నా విప్రు డిట్లనె. ఓ ప్రేయసీ! ఒకానొక కారణమున భగవంతుడు స్వయముగ నర్చావిగ్రహ రూపమున నుద్భవించిన భూమి క్షేత్రము.

తీర్థం పుణ్యనదీమయం సు నయనే । యత్రావగాహ్యాన్వహం
సిద్ధా గౌతమ కుంభసంభవముఖా । స్తేపుస్తపో దుర్లభం
తీర్థం క్షేత్రమథే భవంతి భవహాః । కాశీ గయాద్యాశ్చ తే
శ్రీభద్రాచల రంగమందిరముఖాః । ప్రత్నా నవీనా అపి ॥ 16

తా॥ పుణ్యాత్ములగు గౌతమాదు లేనదులయందు ప్రతిదినమును స్నానమాడి పరమ దుర్లభమగు తపము నొనరించిరో యానదులు తీర్థములు. మఱియు కాశీ గయా ప్రయాగాదులును భద్రాచల శ్రీరంగాదులును తీర్థములును క్షేత్రములును నగును.

ఇత్యాకర్ణ్య వచః ప్రమోదకలితా । పత్యుస్సతీ సాబ్రవీత్
శ్రీభద్రాచలనామతః పులకితా । కోయంతు భద్రాచలః
నాయం క్వాపి శిలోచ్చయేషు విదితో । నో వా పురాణాదికే
సోయం నామ కథం ప్రసిద్ధిమగమత్ । క్షేత్రైః ప్రసిద్ధైస్సమం ॥ 17

తా॥ అని పతి యన భద్రాచల మనగనే యొడలు పులకరింప నా సతి నాథా! భద్రాచల మనగ నేది? ఇది పురాణములలో గాని కులపర్వతములలో గాని ప్రసిద్ధము కాదే? ఎక్కడ నూరును పేరును లేని యిది కాశీ గయాదులతో నెట్లు సమమంటిరి?

తామాహాథ బుధేంద్రనందిత మహాపాండిత్యభాగ్భూసురః ।
శ్రీభద్రాచలవర్ణనేన మహితాం వాంఛాం చికీర్షుస్స్వకాం ।
ముగ్ధే దుగ్ధపయోధినందనసుఖి ప్రీతోస్మి తే పృచ్ఛయా ।
సీతాలక్ష్మణరామ సంశ్రయగిరేః శోభాస్స్మృతేర్మాలయా ॥ 18

తా॥ అని యడుగ నో సుందరీ! నీ వడిగినందున సీతారామలక్ష్మణుల నివాసమగు భద్రగిరి యందమంతయు జ్ఞాపకము వచ్చినది. మేలు!

మేలు ! నీ వడిగినది బాగున్నది. భద్రాచలమును వర్ణించి నావా క్యమును పవిత్రముగ జేసికొనెద.

అభినంద్యేత్థమారోగ్యసౌ । జగాద స్వప్రియాంప్రతి
సంస్మృత్యపూర్ణంచిత్తేన । భద్రాద్రి జననాదికం ॥ 19

తా॥ అని కొనియాడి యావిప్రుడు భద్రాద్రి పుట్టుక మొదలగు దాని నంతను జ్ఞాపకముచేసికొని యిట్లనెను.

## ——♦ బ్రహ్మాండపురాణమునందలి భద్రాద్రి పుట్టుక. ♦——

శ్రీమద్బింబఫలాధరే శృణుపురా । వృత్తాంచగాథాం ప్రియే
సీతాలక్ష్మణ సంయుతో రఘుపతిః । కుర్వన్ విహారం వనే
కస్మింశ్చిద్విపులేఽశయిష్టదయితా । యుక్త శ్శిలాయా స్తలే
తుష్టఃప్రాహతదా భవిష్యసిశిలే । మద్భక్తవర్య స్త్వితి॥ 20

తా॥ ప్రియసీ! ఒకగాథను చెప్పెద వినుము. సీతాలక్ష్మణసం యుతుడై రాముడు వనవాసము చేయునపు డొక రాతిపై దయితతో శయనించి సుఖించి యాశిలపై యనుగ్రహముగలిగి, ఓశిలా ! నీవు నాకు పమరభక్తుడవగుదువని యనెను.

మేరుస్స్వప్రియ యాసమం కమలజం ! తప్త్వాతిఘోరం తపః
తస్మాత్ప్రాప వరం కులస్యతిలకం । శ్రీరామభక్తం సుతం
పశ్చాత్సాపి శిలా జజానతనయ । శ్మేను దేవ్యాంమహాన్
సోయం భద్రగిరిర్బభూవ పరమో । భక్తశ్చజాతిస్మరః ॥ 21

తా॥ మేరువు తనదేవితో బ్రహ్మనుగురించి యంతకుముందే ఘోరతపమాచరించి ప్రత్యక్షమైన యాదేవునివలన శ్రీరామభక్తుడగు సుతుని వరముగా బడసెను. శ్రీరామునిచే ననుగ్రహింపబడిన శిలయే మేరుసుతుడై పుట్టెను. వాడే భద్రుడు. పరమభక్తుడును, పూర్వజన్మ స్మృతిగలవాడును.

యతో ధాతా మేరోర్వరమదిశదాజ్ఞా రఘుపతి ।
యతోభక్తస్సుప్తస్త్వమయి భవితేత్యాహపరతః ।
తతోభద్రశ్శైలస్త్వద్రఘుతిలక భక్తస్సుదశనే ।
బభూవా బాల్యాదప్యతిగురు తపస్సక్తహృదయః ॥ 22

తా॥ మొదట మేరువునకు బ్రహ్మ యిచ్చినవరము వలనను, తర్వాత రాములవారు శిలను నీవు నాకు భక్తుడవగుదువని యనుగ్రహించినందునను ఆశిలయే భద్రుడై పుట్టి భక్తుడై బాల్యమునుండియు తపమునే జేయుచుండె.

అణౌచిత్తేఽశక్తస్సకలజగతీభారసహిత ।
శ్చిరంస్థాతుం విష్ణుర్బహిరవగతస్త్వ్యస్ఫురతః ।
స్థితః పప్రచ్ఛాయుం వరయవరమిత్యం బుజకరే ।
సచాప్యాహస్వామిన్ మమ శిరసితిష్ఠేతి ముదితః ॥ 23

తా॥ అణుపరిమాణమగు భద్రుని చిత్తమున సకల జగముల భారముతో చిరకాలము నిలువలేక వెలుపలికివచ్చెనో యనుకొనునటుల శ్రీహరి యాతనియెదుట నిలచి నీకేమికావలెనని యడుగ సంతసమున నాతడు నీవు నాశిరమున నివసింపుమని కోరెను.

తథేత్యంతర్ధానం గతవతి విభౌభద్రశిఖరీ ।
ససితాసౌమిత్రిం దశరథసుతం స్వస్యహృదయే ।
తపస్తేపేఘోరం చిరమథహరిర్విస్మృతవరః ।
కదాచిత్తత్స్మృత్వా సరభసమగాత్తస్యనికటం ॥ 24

తా॥ అట్లే యని హరి యంతర్ధానమాయెను. భద్రుడు పూర్వస్మృతి కలవాడు గాన మునుపు తాజూచిన సీతాలక్ష్మణ సహితుడగు రాముని మనమున నిలిపి మఱల తపముజేయ నారంభించెను. హరియు నతనికిచ్చిన వరమును మఱచిపోయి యొకప్పుడు జ్ఞాపకము రాగా నతిత్వరతో వైకుంఠమునుండి భద్రునివద్దకు వచ్చెను.

త్వరావశాచ్ఛంఖమ సవ్యహస్తే । చక్రంచసవ్యే సదధారశౌరిః
ధనుశ్శరౌ చాప్యపరేచహస్తౌ। యుగ్మేఽద్యచాస్తామత ఏవతస్య ॥ 25

తా॥ శ్రీహరి త్వరపడి వచ్చునపుడు శంఖమును కుడిచేతను, చక్రము నెడమచేతను, శరచాపముల నితరహస్తయుగమునను ధరించెను. గాన నవి యట్లే యిప్పటికిని భద్రాద్రిరాముని హస్తములందున్నవి.

భద్రాద్రివాంఛా పరిపూరణాయ । యాతీతివిజ్ఞాయచ లోకమాతా
సీతాస్వరూపత్వరయాస్వనాథం । శేషోస్వగా ల్లక్ష్మణరూపధారీ ॥ 26

తా॥ భద్రుని కోరిక దీర్చుటకు స్వామి వేంచేయుచున్నారని తెలిసికొని శ్రీమహాలక్ష్మి సీతయై వెంటనే వచ్చెను. శేషుడును మఱల లక్ష్మణరూపధారియై వారివెంట వచ్చెను.

దండకా కాననే గౌతమీ పార్శ్వతటే ।
భద్రమూర్ధ్న్యేస్థితస్తేన సీతాపతిః ।
సింధుతో స్యుత్తో లక్ష్మణేనాన్విత ।
స్సీతయాభూతలే క్వాపినాసౌ తథా ॥ 27

తా॥ ఆకారణమున సీతాపతి, గౌతమీపార్శ్వతటమున, దండకారణ్యమున, భద్రునిశిరమున చతుర్బాహుడై సీతా లక్ష్మణ సహితుడై యుండెను. మఱెక్కడను చతుర్బాహువగు రాముడు లేడు.

దేవతారాధితో భద్రమూర్ధాతలే ।
రాఘవోఽనేకవర్షాణ్యనానే కలౌ ।
పోకలాఖ్యే కులేజాతయా భక్తయా ।
తాళనై వేద్యమాత్రేణ చారాధితః ॥ 28

తా॥ అప్పటినుండియు భద్రగిరిపై వేంచేసియున్న రాముడు దేవతలచే చిరకాల మారాధింపబడి కలియుగమున ననేకయేండ్లు గడ

చినపిమ్మట పోకల దమ్మక్క యను భక్తురాలు కాటిపండు నివేదింప దిని తృప్తుడై యుండెను.

కులశిఖరిగణే సౌభద్రశైలో నగణ్య
స్తదపి పరమభక్తే ష్వాస్తతం స్థానమాప ।
తదను యవనరాజప్రాదనిష్యం దధానో ।
వ్యరచయదను శైలం పట్టణం గోపనాఖ్యః ॥ 29

తా॥ కాంతా! నీవన్నట్టీ భద్రుడు కులపర్వతములలోనివాడు కాకున్నను పరమభక్తులలో నగ్రగణ్యుడు. పిదప గోల్కొండనవాబు రాజ్యమున తహశ్శీల్దారుగానున్న కంచర్ల గోపన్న భద్రగిరి చుట్టును నూరు కట్టించెను.

శ్రీమద్భద్రాచల పురవరం వర్ణయిష్యామి కాంతే ।
రమ్యాం పుణ్యాం రఘుపతిపదైరంకితం పర్వతంచ ।
చైత్రే సేతుం హిమగిరి మభివ్యాప్య యేసంతి దేశాః ।
తేభ్యస్సర్వేజని సఫలతా మేత్యయాత్రాపయంతి ॥ 30

తా॥ ఆసేతుసీతాచలమున నున్న దేశములనుండి చైత్రమాసముననే భద్రగిరి యాత్రచేసి జనులు జన్మమును సఫలము చేసికొందురో రఘుపతిపదాంకితమగు నాపర్వతమునుపురమును వర్ణించెదవినుము.

—♦ పురవర్ణన. ♦—

గోదావరీవహతియస్య పురస్యపశ్చా ।
దారాచ్చ పుణ్యసలిలాదిశి దక్షిణస్యాం ।
శ్రీరామచంద్ర పరిపాలనభాగ్యశాలి ।
భద్రాద్రినామనగరం భువిభాతి రమ్యం ॥ 31

తా॥ ఏయూరికి పడమటను దక్షిణమునను దగ్గరగా గోదావరియను పుణ్యనది ప్రవహించునో, యెచ్చట శ్రీరామచంద్రుడు ప్రభువో యాపురమే భద్రగిరియని లోకమున ప్రసిద్ధి.

## తాత గుడి.

మాహేంద్ర్యాందిశి భద్రిశైలనగరే । గోవిందరాజాలయో
మర్త్యానామఘనాశనం విరచయన్ । జాగర్తిపశ్చాన్ముఖః
యస్మిన్ దక్షిణనాయకో విజయతే । గోవిందరాజోయుతః
శ్రీదేవ్యాచభువాచ పుష్పధనుషం । సంతర్పయన్ సంతతం॥ 32

తా॥ భద్రాచలపురమున తూర్పుదిశను గోవిందరాజాలయము పడమరముఖముగా నున్నది. దక్షిణనాయకుండగు గోవిందరాజాలు అందు శ్రీదేవితోడను, భూదేవితోడను సుఖముగ నుండును.

తస్మిన్నుత్సవవాసరేషు సతతం శ్రీరామచంద్రప్రభుః ।
సీతాలక్ష్మణసంయుతో విహరణం కుర్వన్నస్తు విశ్రాంతయే ।
స్థిత్వాభక్తవిగీతమాత్మచరితం గోవిందరాజాలయే ।
శ్రుత్వాతాళమృదంగనృత్యసహితం యాత్యేవ పశ్చాత్తతః॥ 33

తా॥ ఉత్సవములయందు రామచంద్రుడు ఊరేగుచు సీతాలక్ష్మణులతో నా గోవిందరాజాలయమున కొంచెము శ్రమదీర్చుకొనుటకు నిలచి సంగీతాదుల చిత్తగించి పడమటికి తిరిగిపోవును.

గోవిందరాజాలయపార్శ్వభాగే । రథస్యశాలా స్తుపిభోర్వశాలా
ఆస్తే రథశ్చిత్రిశతైస్సమేతి । స్తత్ర్ప్రజ్వలన్ రామ విభోర్వశాలః ॥ 34

తా॥ గోవిందరాజాలయమునకు ప్రక్కనే గొప్ప రథశాలయున్నది. అందు నానాచిత్రములతో బ్రకాశించు శ్రీరాములవారిరథముండును.

## సూర్యవీధి.

గోదావర్యాస్తట భువమభివ్యాప్య గోవిందరాజ ।
ప్రాసాదాంతా విపులలలితా సూర్యవీధిచకాస్తి ।
తస్యామేవాలయతతిరభూద్వైష్ణవ బ్రాహ్మణానాం ।
యస్యాద్వారా ణ్యరదరయుతా న్యూర్ధ్వపుండ్రాంకితాని॥ 35

తా॥ గోదావరి మొదలు గోవిందరాజాలయమువరకును వీధి యుండును. అందే వైష్ణవ బ్రాహ్మణుల యిండ్లుండును. వాని వాకిళ్ళ శంఖచక్రోర్ధ్వపుండ్రములు బ్రకాశించును.

తస్యాం పార్శ్వే దక్షిణే రామతుష్ట్యై ।
భక్త్యాయుక్తో మండపం నిర్మమాయ ।
విప్రః కశ్చిచ్ఛ్రాంతి శాంతించికీర్షుః ।
శ్రీరామస్య ప్రీతిదేషూత్సవేషు ॥ 36

తా॥ ఆ సూర్యవీధియందు దక్షిణ పార్శ్వమున నొక విప్రుడు శ్రీరామప్రీతికై యొక మంటపమును గట్టించెను.

సురభీకురుతే సుమోచ్చయ । స్సతతం మండప మగ్రవర్తినః
కరవీరయుగస్యతత్ర తత్ । క్షితిజాజానిరుపేత్యతిష్ఠతి ॥ 37

తా॥ ఆమండపముముందర రెండు గన్నేరుచెట్లు గలవు. వాని పూలచే గుమగుమలాడుటచే కాబోలు ప్రతియుత్సవమున నా మండపమున రాములు కొంచెము సేపు వేంచేసి పోవుచుండును.

తస్మాత్పశ్చాద్రాజసౌధాని రాజ్ఞః ।
కార్యవ్రాతస్థానమాస్తే విశాలం ।
సీతాజానేః పాఠశాలాస్తి పశ్చాత్ ।
యస్యాం బాలాః కావ్యపాఠాన్పఠంతి ॥ 38

తా॥ ఆమండపమునకు పడమరగా నుత్తర శ్రేణిలో రాజావారి మేడలును కచేరియు గలవు. పిమ్మట సీతారామచంద్ర ప్రభువువారి సంస్కృత పాఠశాల కలదు. బాలురందు కావ్యములు జదువుదురు.

## రామదాసుగారు గట్టించిన దేవాలయం.

పశ్చాద్రాజతిభద్రశైల శిఖరాలంకార కారిప్రభ ।
ప్రాకారప్రవరాంతరేతి విపుల శ్రీరామచంద్రప్రభోః ।

ప్రాసాదః కనకాచలం పరిహసన్ హేమప్రభామండలైః ।
చక్రం దేవవినిర్మితం యదుపరి ప్రత్నైః ప్రతిష్ఠాపితం ॥ 39

తా॥ సంస్కృత పాఠశాలకు పడమరగా భద్రగిరి శిఖరాలంకారమగు ప్రాకారములోపల బంగరుకాంతులతో కనకాచలమును పరిహసించు శ్రీరామచంద్రుల కోవెల కలదు. దానిపైని ప్రతిష్ఠించిన చక్రము దేవనిర్మితము.

గోదావర్యాః ప్రవాహతలగతం చక్రమానీయతూర్ణం ।
ప్రాసాదాగ్రే మమవిధియుతం స్థాపయేరిత్యుదర్క్య ।
స్వప్నే గోపాహ్వయమథతథా ప్రాతరస్వాప్య తేన ।
ప్రాప్తే చక్రే దశరథసుతః స్థాపయామాస శృంగే ॥ 40

తా॥ కంచర్ల గోపన్న గుడి కట్టించునపుడు శిఖరప్రతిష్ఠకై చక్రము నెన్నిసార్లు చేయించినను విరిగిపోయెనట. అంత నాతడు విచారముతో పరుండ స్వప్నమున రాములు దర్శనమిచ్చి గోదావరిలో నాపసానిమడుగున చక్రమున్నది. దానిదెచ్చి ప్రతిష్ఠింపుము విచారపడకుమని చెప్పగా, నాభక్తు డట్లే యుదయమున చేపలవలలతో మడుగున వెదకింప నందు చక్రము దొరకెను. దానిం దెచ్చి యాతడు ప్రతిష్ఠించినందున నది రాముడే చేయించుకొన్నదాయెను.

యః కంచర్లకులోద్భవేన యవనక్షోణీశ రిక్తవ్యయం ।
కృత్వా గోపనమంత్రిణా విరచితః క్రీతః పునస్తద్ధనం ।
దత్వా లక్షహిరణ్యమట్టకలితం తానీష నామ్నో విభోః ।
శ్రీరామేణ సలక్ష్మణేన దయయా దాసస్య మోక్షేచ్ఛునా ॥ 41

తా॥ కంచర్ల గోపన్న తానీషా ధనముతో నా దేవాలయము గట్టించెను. ఆతురక తెలిసికొని రామదాసును ఖైదుచేసెను. రాములవారు లక్ష్మణస్వామితో కలసి గోల్కొండకుపోయి యారులక్షలవరాలు తానీషకిచ్చి దయతో దాసునువిడిపించెను. కాన నది రాముడుకొన్నదే.

సూర్యత్విడ్వికస త్పయోజముకుళప్రాంతోద్భ్రమద్భ్రాంభర ।
స్తోమోద్ధూతసరోజధూళికలితో గోదావరీ మారుతః ।
ప్రత్యూషే వాతి భద్రవాద్యనిచయోన్నిద్రస్య సీతాపతేః ।
సేవార్థమనుసంచరత్యనుదినం రామాలయస్యాంగణే ॥ 42

తా॥ ప్రాతఃకాలమున మంగళవాద్యములతో నిద్రమేల్కొనిన శ్రీరామచంద్రుల సేవకై వాయుదేవుడు సూర్యకాంతిచే వికసించు తామర మొగ్గలలోనుండి యెగురుచున్న తుమ్మెదలచే నెగరగొట్టబడిన పుప్పొడిని గలుపుకొని గోదావరిమీదినుండి వచ్చి యనుదినమును రామాలయపు ముంగిటిని కాచుకొని యుండును.

—♦ మొదటి ప్రాకారము. ♦—

ప్రాకారే ప్రథమే విభాతి విబుధాధ్యక్షస్య రామప్రభోః ।
ఆదాయవ్యయకార్యసద్మ విపులం శ్రీచిత్రకూటాహ్వయం ।
సౌధం దర్పణపుంజరంజిత మహత్యుద్యచ్చ చిత్రాన్వితం ।
ఆస్తే భార్గవవాసరే ప్రచలతి శ్రీమత్ప్రభూత్సవః ॥ 43

తా॥ రామాలయ ప్రథమప్రాకారమున శ్రీచిత్రకూటమను పెద్దకచేరీ గలదు. నానాచిత్రాలంకృతమగు నద్దాల మహాలును గలదు. అందు శుక్రవారమున ప్రభూత్సవము జరుగును.

యస్మిన్ ద్వితీయే మణిరమ్యభౌమే ।
సీతాసతీ లక్ష్మణపూర్వజాతౌ ।
అక్షతారోపణ మన్వభూతాం ।
పూర్వం స్థితోఽత్రాపి చ మండపోఽగ్ర్యః ॥ 44

తా॥ మఱియు రెండంతస్థులుగల మణిరమ్యమగు నొకమండపమా చిత్రకూటమున కెదురుగ నున్నది. దాని రెండవ యంతస్థున పూర్వము సీతారాములకు తలంబ్రాలు పోయువారు.

కిం చాన్యః గృహామ స్థితస్యనికటే భోగార్థకై స్స్వామినః ।
పూర్ణం వస్తుభిరాజ్యతండులగుడా ద్వైన్యాని పాకాలయో ।
ధీయంతేఽత్రనియుక్త సేవక జనై శ్శశ్వన్నిరీక్షాపరైః ।
సేవార్థైనసము పేయుషాం ప్రతిదినం శ్రీరామచంద్రప్రభోః ॥ 45

తా॥ ఆ మండపముప్రక్కనే స్వామివారి భోగములకై నిలవ చేసిన యాజ్యతండుల గుడాదులతో నిండినకొట్టు గలదు. నౌకరులు రాముల సేవకై వచ్చువారిని సక్కడనేయుండి రక్షించుచు నవసరములగు సరకుల పాకాలయమున నొప్పగింతురు.

తస్యప్రాంతే లలిత భగవత్కృష్ణలీలా వినోద ।
స్థానం ప్రాంశ్వాయస దృఢచతుస్తంభ గంభీరశోభం ।
యస్మిన్ కృష్ణాకృతి ధృతిరతః క్రీడితం గోపబాలై ।
శ్శిక్యాకృష్టిం నభసికురుతే రామచంద్ర స్సలీలం ॥ 46

తా॥ ఆ కొట్టుప్రక్కనే కృష్ణాష్టమి దినమున కృష్ణావతారముతో స్వామి యుట్టిగొట్టుటకై పొడవులగు నినుపస్తంభములపై సమర్పబడిన యొక రేకులపాక గలదు.

తస్యోపాంతే మండపే రామచంద్ర ।
స్తార్క్ష్యారూఢో యాతివీథ్యాం విహర్తుం ।
హస్త్యారూఢాస్పృశ్య శాఖాగ్రభాగం ।
సింహద్వారంత స్సపాశ్వేఽత్ర చకాస్తి ॥ 47

తా॥ ఆయుట్లపాక తర్వాతనున్న మండపమున స్వామి గరుడారూఢుడై యూరేగబోవును. ఏనుగుపైనెక్కి నిలచినను మనుష్యునకందని యుత్తరాశిగల సింహద్వారమాప్రక్కనేకలదు.

రామానుజపదపూర్వక మములంకిలకూటమత్రభాతిపిభోః ।
అతిరుచ్యభక్ష్యభోజ్యప్రకర పాకాశ్రయమతులం ॥ 48

తా॥ సింహద్వారమునకు నానుకొని తూర్పున రామానుకూట ముందు. అందు స్వామికి ~~భోగ~~ భోగమున నుపయోగింపబడు నానా విధ భక్ష్యభోజ్యములును పచనము చేయబడును.

కాశీనాథకులోద్భవో ఘనమతిర్నాగేశ్వరాఖ్యో ద్విజః ।
శైవో భద్రగిరీంద్రదేవనిలయే చేశాలయేప్యన్వహం ।
విద్యుద్దీపసమర్పణాయ ఘటితం యంత్రం దదౌ శాశ్వతం ।
తద్యంత్రం ఘటితం పురోముకురసత్సౌధస్య సీతాపతేః ॥ 49

తా॥ కాశీనాథుని నాగేశ్వరరావను నొక శైవబ్రాహ్మణుడు రామాలయమునను, నీశ్వరాలయమునను మెరుపుదీపముల బెట్టుటకై యేర్పడిన యొక యంత్రమును శాశ్వతముగ నిచ్చెను. ఆయంత్ర మద్దాలమహలున కెదురుగ నమర్చబడినది.

ముకురనికరరాజత్సౌధరాజాగ్రభాగే ।
పలిలసతి విచిత్రం విద్యుతాం దీపయంత్రం ।
పరిపతతి పయోధా వుష్ణరశ్మావపసత్రిం ।
జనయతిహిమరశ్మిః రామదేవాలయేతత్ ॥ 50

తా॥ అద్దాలమేడ కెదురుగనున్న యీ విద్యుద్దీపయంత్రము బలు చిత్రమైనది. ఏమన:—ప్రతిదినమునను నొక యుష్ణకిరణుడు సముద్రమున బడనిది యనేకుల శీతకిరణుల రామదేవాలయమున గనుచుండును.

విద్యుద్యంత్రగృహస్య దర్పణలసత్సౌధస్య చాభ్యంతరే ।
గిర్యారోహణకారణాయ రచితస్సోపానమార్గస్థితిః ।
శ్రీరామప్రభురుత్సవేషు సతతం యస్మాత్త్వవారోహతి ।
ద్వారాద్రీతిమయాదుపేత్య నిలయాత్కర్తుం విహారం పురే॥ 51

తా॥ ఆమెరుపుదీపముల యంత్రశాలకును నద్దాలమహలునకును నడుమ గుట్టపైకెక్కుటకై సోపానమార్గమును రచించిరి. ఉత్స

వములయం దూరేగుటకై స్వామి దేవళముమండి బయలు దేరి యు త్తర ద్వారమువద్దనున్న యూసోపానములమీాదినుండి దిగి యూరేగును.

చిత్రకూటస్య పార్శ్వేఽస్తి । సాలస్య ప్రథమస్యచ
ద్వారం ద్వితీయ యస్యాంతే ; రాజత్యాపణమండలీ ॥ 52

తా॥ చిత్రకూటము ప్రక్కనే మొదటి ప్రాకారముయొక్క ద్వితీయద్వారము కలదు. దానిసమీాపమున నగళ్లవీధి యున్నది.

—♦ ద్వితీయప్రాకారము. ♦—

ప్రాకారేచ ద్వితీయె పవనదిశిసమాటీకతే యాగశాలా ।
యాగాయస్యాం పవిత్రోత్సవముఖవిదితాః పాంచరాత్రైః క్రియంతే ।
యస్యా ఏవాగ్రభూమ్యామభవదితిపురాచక్షతే పూర్వవిజ్ఞాః ।
సీతారామాక్షతారోపణమితినగరీవాసినో వృద్ధవిప్రాః ॥ 53

తా॥ రెండవప్రాకారమున వాయవ్యదిశను యాగశాల కలదు. దానిపైనున్న మండపమున రామదాసుకాలమున రాముల తలబ్రాలు పోయు వారని యూయూరి వృద్ధవిప్రులందురు. యాగశాలయందు పాంచ రాత్రులు పవిత్రోత్సవాదులు జరుపుదురు.

పరితస్సుపరీతపుష్ప వృక్షః । క్రతుకాలేస్థితయేఽత్రవాహ్యహంతుః —
ప్రచకాస్తిహిమండపః పురాణో । భగవద్భక్తవినిర్మితో విశాలః ॥ 54

తా॥ యాగకాలమున స్వామి వేంచేయుటకై శాల కెదురుగ భక్తులుగట్టించిన పెద్ద మండపము కలదు. దానిచుట్టును సువాసనగల పూలచెట్లుండును.

—♦ రామదాసుగారు కట్టించిన గోపురము. ♦—

దూరాదాలోక్య భద్రాచలశిఖరగతం గోపురం రామచంద్ర ।
ప్రాసాదాగ్రేఽభ్రగంగాపరిపతనదియంప్రాప్యచాత్యచ్ఛకారిత ।

గంగాస్తోత్రైః పరివృతాః ప్రథమమథ విమృశ్యాధికం లజ్జమానాః ।
భక్తాః రామదాసపరిచిత గురుయశోరాశిముచ్చైస్తృణంతి ॥ 55

తా॥ కళ్యాణోత్సవమునకు వచ్చు భక్తులు దూరమునుండి రాములవారి గోపురమును జూచి మొదట ఆకాశమునుండి గంగ పడుచున్నదనుకొని గంగాస్తోత్రముజేసి దగ్గరకు రానురాను విమర్శించి గోపురమని తెలిసికొని మిక్కిలి లజ్జించుచు రామదాసుగారి యశోరాశియని మిక్కిలి కొనియాడుదురు.

కైలాసాచలకాంతకాంతికలితం భూమైరనేకైర్యుతం ।
హేమాకారకిరీటతుల్య కలశాన్ మూర్ధ్నా దధానం శుకాన్ ।
శశ్వత్తారకమంత్రరాజపఠనాత్కోలాహలం కుర్వతః ।
పాపవ్యూహనసారంచ గోపురమిదం దృష్ట్వాతుకస్తృప్యతి ॥ 56

తా॥ కైలాసమువంటి తెల్లని కాంతితోడను, అనేకములగు సంతస్థులతోడను, బంగరుకిరీటములవంటి కలశములతోడను, విడువక తారకమంత్రపారాయణ జేయుచున్న చిలుకలతోడను ప్రకాశించు నీ గోపురమును జూచిన నెవరికి తనివితీరును?

విద్యుద్దీపప్రకరమహసాదీప్యమానం నిశాయాం ।
రత్నస్తోమద్యుతి సమలసత్కంఠపారావతానాం ।
వాసస్థానం సమధిగతసత్పుత్రికారూపభాగ్భిః ।
వ్యాసప్రఖ్యైర్మునిభిరమలైర్భాసురం గోపురంతత్ ॥ 57

తా॥ రాత్రియందు మెరుపుదీపములచే ప్రకాశించుచు నానా రత్నముల కాంతులవంటి కంఠకాంతులుగల పావురములకును బొమ్మల రూపముతో వచ్చియున్న వ్యాసాదిమహర్షులకును నాశ్రయమగు నీ గోపుర మెంత యింపుగనో యుండును.

చరీకరీతి గోపురం సరీసరజ్జనవ్రజం ।
ప్రమోదవారిరాశి మజ్జనేనతృప్తమానసం ।

యదీయదర్శనేన పూర్వజన్మపాపసంచయో ।
ఝడిత్యశేషమాప్నోతిర్భ వేదపూర్వపావకే । 58

తా॥ ఏగోపురమును జూచినమాత్రముననే పూర్వజన్మకృతపాపములన్నియు భస్మమగునో యాభద్రాద్రిగోపురము కన్నుల పండువుగా గనబడుచుండును.

చత్వారి పంచాపిషడాననాని । సహస్రవక్త్రాణ్యథవాపిలబ్ధ్వా ।
తద్గోపురస్యాఖిలవర్ణనాయ । నేశామనుష్యాః కిముతాల్పపుణ్యాః ॥ 59

తా॥ నాలుగు, అయిదు, ఆరు, వేయియేసి నోళ్లుగల దేవతలైన నాగోపురమునంతయు వర్ణింపలేనప్పుడల్పపుణ్యులగు మానవులచేత నేమియగును.

సహస్రనేత్రైస్సతతం విలోక్య । సహస్రవక్త్రైరపి వర్ణయిత్వా ।
స్వర్గేశ్వరోవా భుజగేశ్వరోవా । యద్గోపురం నాభవతాంహితృప్తా ॥ 60

తా॥ ఆగోపురమును ఇంద్రుడు వేయికన్నులతో నెల్లపుడు చూచియు శేషుడు వేయినోళ్ల బొగడియు తృప్తిజెందనేలేదు.

కైలాసశైలః కిముగోత్రరాజః । ఉతాథవాశైలసుతాధవస్య ।
భద్రాద్రిరామాలయ సన్నికర్షే । ప్రాయస్త్విదం గోపురమేవనూనం ॥ 61

తా॥ భద్రాద్రిరామాలయమువద్ద నిది కైలాసమా లేక యీశ్వరుని యెద్దా? యని కొందరు సందేహపడి యవి రెండును నిట నేలయుండును? బహుశః యిది గోపురమే యైయుండుననుకొందురు.

ఉక్షైనవాకాదయమీశ్వరస్య । శ్రీరామసేవార్థ ముపాగతస్య ।
యతోస్య శృంగాగ్రతలే ఖాతిహ్యుత్ఖాతలగ్నాకిలమేఘమృత్స్నా ॥ 62

తా॥ మఱికొందరు ఇది శ్రీరాముల సేవింపవచ్చిన యీశ్వరుని నందివాహనమే దాని శృంగాగ్రముల నది కుమ్మిన మేఘమృత్తికకూడ నున్నది యందురు.

వింధ్యం పూర్వ వర్ధమానం కదాచి ।
తత్కుంభోద్భూతో వారయా మాసవామాని ।
కైలాసాద్రిం వర్ధమానం త్విదానం ।
కోవాంకుర్యాద్భ్రష్టలేగం పృథివ్యాం ॥ 63

తా॥ ఇంకను కొందరు దూరమునుండి యీగోపురమును జూచి పూర్వ మొకప్పుడు ఇట్లే యెదిగిన వింధ్యపర్వతమును తన శిష్యుడుగాన మహానుభావుడగు నగస్త్యమహాముని వంచి లోకోపకారము చేసెను. ఇప్పుడీ కైలాస మెదుగుచున్నదే లోకమున దీని నెవ్వరు మాన్పగల రని దిగులుపడుదురు.

కళ్యాణోత్సవమండనాయ సుధయా లిప్తంతు యద్గోపురం ।
కైలాసం పరివర్ధమానశిఖరం వింధ్యాద్రివత్క్వచిత్ ।
మత్వారాత్రిదినేశ్వరౌ పురహరం సంప్రార్థయేతేఽధునా ।
కైలాసాచలవారణం కురువిభోపాహీతి విశ్వేశ్వరం ॥ 64

తా॥ వీరువారననేల సూర్యచంద్రులు కళ్యాణోత్సవ సమయమున నలంకారమునకై సున్నాలిప్తమగు నాగోపురమును జూచి యే కారణముననో కైలాసము వింధ్యమువలె నెదుగుచున్నదనుకొని మహా ప్రభో! కైలాసపతీ! ఈ కైలాసమును మా దారికడ్డమురాకుండ వాపుమని ప్రార్థించుచున్నారు.

## ఇంద్రనారద సంవాదము.

కస్మాన్నారద? భూతలాత్; సురమునే! భూలోకవార్తాద్యకా? ।
వజ్రిన్! వింధ్యవదేధతేద్య; కిమిదం? కైలాసనామాగిరిః ।
హేతుఃకోఽస్య? నగమ్యతే; కథమిదం జ్ఞాతంత్వయా? దర్శనాత్ ।
ఆహాత్కిం? నహిదూరతః; ననహితద్భ్రాచలే గోపురం ॥ 65

తా॥ నారదా! యెక్కడినుండి? భూలోకమునుండి; సుర మునీ! భూలోకవార్తలేమి? వజ్రధరా! ఇప్పుడు వింధ్యమువలె నెదు

గుచున్నది; అదియేమి? కైలాసపర్వతము; కారణమేమి? మఱి నేనైన జగడముపెట్టితివా? నేనెఱుగను; అయిన నిది నీకెట్లు తెలిసెను? చూచుటచేత; దగ్గరకు పోయిచూచితివా? లేదు దూరము నుండియే చూచితి; కాదు కాదది భద్రాచలగోపురము.

## —♦ అధ్యయనోత్సవ మండపము. ♦—

నానారత్నవిభావిభాసిత మహాచిత్రైరలంభూషితే ।
యస్మిన్నధ్యయనోత్సవే ప్రతిదినం మత్స్యాదిరూపావహాః ।
సీతాలక్ష్మణసంయుతః కలరవాః శ్రీపాశురాః సేవతే ।
శ్రీరామోనిశ మస్తి గోపురవరస్యోదీచ్యసౌమండపః ॥ 66

తా॥ నానారత్న కాంతుల చిత్తరువులచే నలంకరింపబడిన యధ్యయనోత్సవమండపమీ గోపురమునకు నుత్తరదిశయందున్నది. అధ్యయనోత్సవదినములలో సీతాలక్ష్మణసహితుడై మత్స్యకూర్మాది రూపములతో రాముడందు వేంచేసి కలవరములగు పాశురముల వినును.

## ♦—చుట్టుకోవెలలు. ♦—

విష్వక్సేనహయాస్యరంగపతయస్సంతానగోపాలకః ।
శ్రీనారాయణ వేంకటేశవరదాః కోదండరామోపరః ।
గోపాలోవరకృష్ణసాగరపరః శ్రీవాసుదేవోఽపరః ।
గోదాచైవవరాహక ప్రభృతయ స్సంత్యత్రసాలాంతరే॥ 67

తా॥ విష్వక్సేన, హయగ్రీవ, రంగనాయక, సంతానగోపాల నారాయణ, వేంకటేశ, వరదరాజ, కోదండరామ, కృష్ణసాగరగోపాల, పరవాసుదేవ, గోదా, వరాహస్వాములును;

కూరేశశ్చ పరాంకుశశ్చ పరకాలాఖ్యాతయోగీశ్వరః ।
యోగీభూతసమాహ్వయో వరవరశ్శ్రీవిప్రనారాయణః ।

శ్రీరామానుజ భక్తిసారవిదితా యోగీసరోనామకః।
సంత్యేతే మునివాహనోఽత్రపరిత శ్రీవిష్ణుచిత్తాదయః॥ 68

తా॥ కూరేశ, పరాంకుశ, పరకాలయోగి, భూతయోగి, వరవరయోగి, విప్రనారాయణ, రామానుజ, భక్తిసార, మునివాహన, విష్ణుచిత్తాదులగు, మహాభక్తులును నీమండపము మొదలుగ రామాలయమునకు చుట్టును ప్రాకారముగ నేర్పడిన దేవళముల నుందురు.

పురందరదిశిస్ఫురన్ముకురముఖ్య విభ్రాజితం।
దృఢాయసశలాకికావృత చతుర్దిశం రాజతే।
అహోత్సవపదం ప్రదక్షిణాః థాతుతద్దర్పణే।
సదాధరణిజా ధవప్రతికృతిర్దర్శ్యతే॥ 69

ఈ రెండవప్రాకారమున తూర్పుగా నొక పెద్ద నిలువుటద్దము తోడను, చుట్టు నమర్చబడిన నినుపకటకటాలతోడను, రమ్యమగు సమావాస్యమండపమున్నది. చుట్టు సేవ యపుడందలియద్దమునరాములవారి ప్రతిబింబదర్శనము చేతురు.

ప్రాచ్యామేవచకాస్తి సర్వవిదితో గోపాలదేవాలయః।
తస్మాద్రామపదాంకితో ఽ ర్కదిశి తద్భద్రస్య మూర్ధా మహాన్।
స్తంభౌద్వ్యాలసతస్తదాలయ పురోభాగే శిలానిర్మితౌ।
యత్రభ్రాజతిశాసనాళిరమలా ప్రాచీనపుణ్యాత్మనాం॥ 70

తా॥ తూర్పుదిశనే గోపాలదేవాలయమును దానికిదక్షిణమున రామపదాంకితమగు భద్రుని శిరముగల గుడియు గలవు. భద్రునిశిరమున కెదురుగ రెండు శిలాస్తంభము లున్నవి. ఆ స్తంభములపైని ప్రాచీనపుణ్యాత్ముల శాసనము లున్నవి.

మధ్యేస్తంభయుగస్య చిహ్నితమభూ త్సీతాపదద్వంద్వకం।
రేఖాఫధ్వజ శంఖచక్రకులిశా~~ంభోజాతచామాంకుశ~~కారాభిరత్యుజ్జ్వలం।
~~భ్రాజచ్ఛత్రహాలాండజప్రముఖ సద్రూపాభిరత్యుజ్జ్వలం।~~
~~దృష్ట్వా యజ్జనసంస్తనం నపి బతిప్రాయః పునర్మానవః॥~~ 71

4
ప్రస్మద్గలోచన గోచరేసకృదపి ధ్వస్తాఘసంఘోనరో।
మాతుస్స్తన్యమసౌకదాపి పిబతి ప్రాయోన జన్మాంతరే॥

తా॥ ఆ స్తంభములనడుమ శంఖచక్రాది రేఖలుగల సీతాపద ద్వంద్వమున్నది. భక్తియుక్తులై యీ పదద్వంద్వ సేవజేయువారిక నెన్నడును తల్లిపాలు త్రాగరు. (ముక్తినొందుదురు.)

భద్రిస్యమూర్ధ్న్యేఽ ముఖమండపేతు ।
స్థిత్వాసుధాం యచ్ఛతిమోహినీత్వం ।
ప్రాప్తస్సురాణామివదైత్య శత్రు ।
స్సీతాపతి ర్భర్మఘటేన నౄణాం ॥ 72

తా॥ భద్రినిశిరమున కెదురుగనున్న ముఖమండపమున స్వామి మోహినీరూపమున వేంచేసి దేవతలకువలె నరులకమృతమును బంగరు కలశముతో బంచిపెట్టును.

యైరాప్తం త్వమృతం భవంతివిబుధా యై ర్నాప్యతే తేఽసురాః ।
ఇత్యాఖ్యాంతితదాతదేవ మనసిక్షిప్త్వాతు తత్రాంజసా ।
తత్ప్రాప్తుం సకలాజనా అ పి తదా కోలాహలం కుర్వతే ।
శృత్వాయం విబుధాస్స్మరంతి మనసా దేవాసురాయోధనం ॥ 73

తా॥ అప్పుడు అమృతముదొరకినవారు దేవతలనియు దొరకని వారు రాక్షసులనియు వాడుక. కావున నక్కడికివచ్చిన వేలకొలది జను లధికారు లెంతయూపిన నాగక యమృతము దొరకదేమో యను నాదుర్దాతో నతి కోలాహలముచేతురు. ఇదివిని పెద్దలు పూర్వము జరిగిన దేవాసురయుద్ధమును తలచుకొందురు.

ప్రాకారభూతాదిశి దక్షిణస్యాం । ఆ గోపురంరాజతి రమ్యపంక్తిః ।
దేవాలయానాం కిల రాజ్యలక్ష్మ్యః । శ్రీభర్మసీతాముఖ దేవతానాం॥ 74

తా॥ దక్షిణదిశను ప్రాకారముగానున్న దేవళముల కనకసీతాది దేవతలు కలరు.

హిరణ్యదేవాలయ యామ్యభాగే । విభాతియ ద్దక్షిణగోపురం తత్
తస్మాత్తు సోపానపరంపరాస్తి । యస్యాశ్చపార్శ్వే కరవీరవృక్షః ॥ 75

తా॥ బంగరు దేవళమునకు దక్షిణమున దక్షిణగోపురమును అ గోపురమునుండి క్రిందికి దిగుటకు మెట్లును, నా మెట్లుప్రక్క నొక గన్నేరుచెట్టును గలవు.

పశ్చాన్ముఖస్య రఘువీరవరాలయస్య ।
కైలాసపర్వతనిభస్య చ గోపురస్య ।
మధ్యేవిభాతి దశతాళసముచ్ఛ్రియోర్ధ్వః ।
స్తంభస్సదా గరుడకేతు విరాజమానః ॥ 76

తా॥ పడమరముఖముగానున్న రామాలయమునకును, కైలాస మునవలెనున్న గోపురమునకును నడుమ పదితాళ్ళపొడుగు గరుడధ్వజ స్తంభమున్నది.

విపులోముఖమండపః పురా । రచితో గోపనమంత్రిణా స్థియః ।
అధునాపి తదగ్రభాగ ఆస్తే । వలయాకారక తాళలక్షణం ॥ 77

తా॥ రామదేవాలయమునకెదుట పెద్ద ముఖమండపము కలదు. దాని ముందువైపున తాటిచెట్టుండుటచే నర్ధచంద్రాకారముగ మలిచి యమర్చిన చూరురాయి యిప్పటికిని నక్కడ నొక తాటిచెట్టుండునది యను కథకు తార్కాణముగ నున్నది.

దమ్మక్కా స్వప్నమధ్యే నయనవిషయతాం ప్రాప్యరామశ్శశంస ।
యత్తాళస్సైవమహ్యాం నయఫలమితితాం తస్యతాళస్యసత్వాత్ ।
తత్కాలేతత్రభక్త స్తదపహృతికృతౌ భీతిముద్బోధయిష్యన్ ।
వృత్తాకారంశిలాయా వ్యరచయదితితన్మండపస్యప్రసిద్ధిః ॥ 78

తా॥ పోకల దమ్మక్కకు కలలోగనపడి యే తాటిచెట్టుపండును నాకు నివేదనచేయుమని రాముడు చెప్పెనో యాకాలమున నాతాటిచె ట్టచటనుండుటచే దాని తీసివేయుటకు భయపడెనని మనకు దోచుటకు రాముడా నాచూరురాతి నట్లు మలిపించెనని చెప్పుదురు.

## —♦ ఆంజనేయస్వామి. ♦—

శ్రీరామనామ వచసా సతతంబ్రువాణః ।
శ్రీమారుతిర్జయతి బాష్పపరీతనేత్రః ।
తార్క్ష్యధ్వజస్యముఖభాసుర మండపస్య ।
మధ్యే రఘువర దర్శనసాగర ఏవ ॥ 79

తా॥ గరుడధ్వజమునకును, ముఖమండపమునకును నడుమ రాముని కెదురుగ నెల్లప్పుడును రామనామ జపము జేయుచు నానంద బాష్పపూరితలోచనుఁడైన యాంజనేయుని యాలయము కలదు.

ప్రాసాదస్యపురః పురశ్చమహతః శ్రీగోపురస్యాప్యధః ।
రతిద్వార తటావరోహణ మహాసోపానమార్గస్యచ ।
పార్శ్వే మంగళచిత్రకూటభవనే సంయోజ్యహస్తావుభౌ ।
రామానుగ్రహకాంక్షిణా హనుమతా సర్వత్రసంస్థీయతే॥ 80

తా॥ ఈమారుతి రామానుగ్రహమునకై దేవళమునకెదుటను, పెద్దగోపురమున కెదురుగ క్రిందను, నిత్తడిద్వారమునుండి దిగు సోపానముల ప్రక్కను చిత్రకూటమునను నెల్లయెడల కాచుకొనియుండును.

## —♦ గర్భాలయము మూలస్వామి. ♦—

నరామో నసీతా నభద్రాద్రిరేషః ।
నవారామభక్తాః పరీతాః కిలామీ ।
సమేతశ్శ్రియా నిత్యసూరివ్రజేన ।
మహావిష్ణురేవైష వైకుంఠవాసీ ॥ 81

తా॥ గర్భాలయమున మూలస్వామినిజూచిన నీతఁడు రాముఁడునుగాఁడు ఈమె సీతయునుగాదు చుట్టును వీరు రామభక్తులును గారు. ఇది భద్రాద్రియుగాదు; ఇక నేమన; నిది వైకుంఠము మహాలక్ష్మితోడను నిత్యసూరులతోడను గూడిన మహావిష్ణువితఁడేనని తోఁచును.

చతుర్బాహుమత్త్వాచ్చ శంఖారిమత్త్వా
ద్గరుత్మద్ధ్వజత్వాద్దయా సంయుతత్వాత్ ।
అమేయప్రభాపుంజసంయోగవత్త్వా ।
స్మహావిష్ణుదేవైష వైకుంఠవాసీ ॥ 82

తా॥ చతుర్బాహుడగుటచేతను, శంఖచక్రములు ధరించుట చేతను, గరుడధ్వజుడగుట చేతను, అపరిమితానిర్వాచ తేజోయుతుడగుటచేతను, నితడు లక్ష్మీసహితుడగు శ్రీహరియే.

విరజానహి గౌతమీయం ।
నహిభద్రాద్రిరయం రమేశలోకః ।
హరిరేషనలక్ష్మణాగ్రజో ।
నహిసీతాసుదతీరమైవసాక్షాత్ ॥ 83

తా॥ మరియు నీనది విరజగాని గౌతమికాదు, వైకుంఠముకాని యిది భద్రాద్రికాదు, ఈతడు శ్రీహరియేకాని రాముడుకాడు, నీమెయు సాక్షాల్లక్ష్మికాని సీతకాదు.

నహరిర్యదివోశ్చతుష్టయం । కథితం రాఘవపర్ణనే క్వచిద్వా ।
నిరగాదయిమంజసాయతో । భువనాత్త్వాదను నిర్జగామలక్ష్మీః ॥ 84

తా॥ ఈతడు వైకుంఠనివాసికానిచో రామునకు నాల్గుచేతులున్నట్లెక్కడనైన వర్ణించిరా? భద్రునకిచ్చిన వరమును మఱచితి గదా యని త్వరగా శ్రీహరి వచ్చినందున లక్ష్మియు వెంటవచ్చెను.

గర్భాలయస్యాపి ముఖేవిశాలా । శాలాస్థితన్మండప పూర్వదేశే
తస్యాం ప్రభుత్వోత్సవమన్వహంచ । నిత్యాగ్నిహోత్రం చలతీశ్వరస్య॥

తా॥ గర్భాలయమునకు ముఖమండపమునకును నడుమ నొక విశాలమగు శాలయు కలదు. అందు ప్రతిదినమునను నిత్యాగ్నిహోత్రి ప్రభుత్వోత్సవములు జరుగును.

దంతధావనమహోత్సవాయ వై । నిర్మితం లసతిచాత్రమందిరం
తత్రరామముపవేశ్యచాన్వహం । కారయంతిఖలు దంతధావనం॥ 86

తా॥ అచట నే దక్షిణపు వైపున దంతధావన మందిరమున్నది. అందు స్వామిని వేంచేయింపజేసి దంతధావనము చేయింతురు.

దంతధావనగృహాదనంతరం । జానకీరఘుకులావతంసయోః ।
భూషణప్రకరమందిరం వరం । రాజతే వృథక్వాటసంవృతం ॥ 87

తా॥ దంతధావన మందిరము నానుకొని దిట్టములగు తలుపులు గల సీతారాముల భూషణశాల కలదు.

## —♦ రామాంతఃపురము. ♦—

కించాంతఃపురమందిరం విలసతి । శ్రీజానకీరామయోః ।
నానాలేఖ్యక చిత్రపుంజరుచిరం । సద్దర్పణభ్రాజితం ।
రత్నస్ఫాటికరాజతాంగవిల । సత్పర్యంక రత్నాన్వితం ।
విద్యుద్దీప సహ స్రకాంతికలితం । శ్రీమద్వితానోజ్జ్వలం ॥

తా॥ మరియు నావిశాలాంకణమున నుత్తరదిశను సీతారాముల యంతఃపురమున్నది. పలురకముల బొమ్మలును, పటములును, నద్దములును; రత్నాలకోళ్ళును స్ఫటికాలపట్టెలును, వెండిచిరికీలును గల దివ్యమైన మంచమును, దేదీప్యమానమగు చాందినియు మెరుపుదీపములును,

కస్తూరీనళదాసితాగరుచయ శ్రీగంధవిస్ఫూర్జితం ।
మల్లీకేసర జాజికాముఖసుమప్రాగ్భారసంశోభితం ।
ద్రాక్షాసారమధూళికా రతిఫలప్రఖ్యాసవైస్సత్ఫలైః ।
రంభాదవ్యరసాలదాడిమముఖైః ప్రద్యోతితం సర్వతః ॥ 89

కస్తూరీ, వట్టివేళ్ళు, కృష్ణాగరు, శ్రీగంధమును, మల్లెలు, పొగడలు, సన్నజాజులు మొదలగు పూలును, ద్రాక్షాసార, మధూళికా,

రతిఫలాదులగు నాసవములును, రంభా, రసాల, దాడిమ్యాదులగు ఫలములును, నాయంతఃపురమున నుండును.

స్వర్ణాకారవిరాజితైర్బహుతరైస్తాంబూలపర్ణైరపి ।
ముక్తాచూర్ణశలాటుకోటిసహితైః కర్పూరకైస్తథా ।
రాజత్కేసరిపత్రికాప్రకలితైశ్చైలాలవంగాదిభిః ।
పూర్ణా నిస్తులవస్తురంజిత తమం కామస్య సందీపనం ॥ 90

తా॥ మఱియు బంగరుకాంతిగల తమలపాకులతోడను, వెండి సున్నపుకాయలతోడను, కర్పూరపుబరణులతోడను, కుంకుమపువ్వు, జాజికాయ జాపత్రి ఏలకకాయలు లవంగాలు, నివిసవియననేల సాటిలేని యమూల్యవస్తువులతోడను నిండి నిత్యకామసందీపనమై యా యంతఃపురము రాజిల్లును.

ముక్తాజాలవిభూషితాంతర మహావజ్రోల్లసచ్ఛృంఖలా ।
బద్ధానూల్యమణిప్రవేకవిలసన్మంచోజ్జ్వలే భాసురే ।
యస్మిన్ సంవిశతి ప్రభా జనకజాజానో తయాజాయయా ।
భక్తాశ్చామరవీజనైస్సవినయైన్నిద్రాపయంత్యన్వహం ॥ 91

తా॥ అందు వజ్రపుగొలుసులకు ముత్యాలదండ లలంకరించి చాందినికి పెద్దపెద్ద వజ్రముల వ్రేలాడగట్టియున్న యుయ్యాలమంచము కలదు. దానిపై సీతాపతి సతితో శయనింప భక్తులు ప్రతిదినమును వింజామరలతో వినయపూర్వకముగ వీచుచు స్వామిని నిద్రపుచ్చుదురు.

నిద్రాపయిత్వా నిశిరమ్యగీతైః । ద్వార్యాంతు దద్వారతలాద్ధిభక్తాః ॥
దిక్పాలకానామథజాగృతేతి । సంబోధ్య తేయాంతి గృహాయనిత్యం ॥ 92

తా॥ భజనపరులు శ్రావ్యములగు పాటల పాడిపాడి స్వామినట్లు నిద్రపుచ్చి మెల్లగ నుత్తరద్వారమునుండి వెలుపలికివచ్చి దిక్పాలకులారా మాసీతారాములు నిద్రించుచున్నారు జాగ్రతగా నుండుడని హెచ్చరించి యిండ్లకుపోదురు.

అస్త్యుత్తరస్యాందిశి గోపురంచ । తస్మాద్బహిరాజతిమండపశ్చ
యో ద్వాదశీమండపనామధేయం । గతస్తదా రామవిభోర్నివేశాత్ ॥93

తా॥ ఉత్తరదిశనుకూడ నొక గోపురమున్నది. దాని వెలుపల నున్న మండపమున ద్వాదశినాడు స్వామి వేంచేయును గాన దాని ద్వాదశీ మండపమందురు.

భువననిధికుమార్యా ద్వాదశీ మండపాగ్రే ।
పరిలసతి మహీయానాలయో భద్రశైలే ।
పరిణతగురుపుణ్యః కృష్ణమాచార్యనామా ।
వ్యరచయదిమ ముచ్చైస్థ్సానమాకాంక్షమాణః ॥ 94

తా॥ ద్వాదశీమండపమున కెదురుగ పూర్వపుణ్యము ఫలింపగా మంచిబుద్ధిపుట్టి కామసముద్రం కృష్ణమాచార్యులు మహాలక్ష్మి యాలయమును గట్టించెను.

ఏకాదశీమండప ఏకఆస్తే । శ్రీ ద్వాదశీమండప పూర్వభాగే
యస్మింస్తుగోష్ఠీ కిల వైష్ణవానాం ।జేజీయతే దాశరథేః పురస్తాత్ ॥ 95

తా॥ ద్వాదశీమండపమునకుతూర్పునఏకాదశీమండప ముండును. ఏకాదశినాడు స్వామి నందు వేంచేయించి శ్రీవైష్ణవులుగోష్ఠినలుపుదురు.

భద్రాద్రేశ్శిఖరేస్థితస్య మహతశ్శ్రీరామదేవాలయ ।
ప్రాకారస్య ధనేశదిశ్యతులితా సోపానపంక్తిః కృతా ।
తద్ద్వారా నవమండపే ఉత్సవసమా సోపాయసీతాపతిః ।
సీతాలక్ష్మణసంయుతో ఉవతరతి స్వర్ణాలయాద్భూతలం ॥ 96

తా॥ భద్రాద్రిపైనున్న శ్రీరాముల స్వర్ణాలయమునుండి స్వామి యుత్తరదిశనుండి దిగుటకు సోపానములున్నవి. శ్రీరామనవమినాడు తలబ్రాలు పోసుకొనుటకు రాముడా మెట్లమీదనుండి క్రిందికిదిగి నూతన కల్యాణమండపమున ప్రవేశించును.

తా॥ అష్టయిశ్వర్యములున్నను నవి యితరుల కిచ్చుటకుగాని తా ననుభవించుటకు గాదని లోకుల కూహగలుగునట్లు చేయుటకై శివుడు భద్రిగిరివద్ద చిన్నగుట్టపై కాపురముండి స్వయముగ నానా భోగపరుడగు రాముని క్షేత్రమును గాయుచు పార్వతితోడ పేద బాపని చందమున గనపడును.

మూఢో నిందతు భోగలేశరహితో విశ్వేశ్వరో త్రైతివా ।
విష్ణోరభ్యధికత్వవర్ణన పరశ్శ్రీవైష్ణవోనందతు ।
అష్టైశ్వర్యయుతస్య శంకరవిభోరారాధనస్య ధ్రువం ।
నానాభోగపరంపరేతిఫలితం రామేణజోఘుష్యతే ॥ 102

తా॥ మూఢుడు భోగలేశము నెరుగనివాడేమి విశ్వేశ్వరుడని నిందించినను, శ్రీవైష్ణవుడు మావిష్ణువే నానాభోగముల ననుభవించును గాన నెక్కువవాడని సంతసించినను రాముడు మాత్రము తా ననుభవించు నానాభోగములును నీశ్వరారాధనకు ఫలమనిసాటించుచుండును.

విష్ణోస్సృష్టిఫలాంభవే దకులితం శూలంశివస్యధ్రువం ।
చక్రంవాస్తు శివార్చనేనహరిణా లబ్ధాకిమేతేననః ।
తత్తత్కార్య సమర్థనాయ తనిమా స్వీకార కార్యేరతా ।
వేతౌతత్వదశా విచారసమయే త్వద్వైతమేవానయోః ॥ 103

తా॥ శివునకు శూలమును విష్ణువిచ్చెను గాన విష్ణు వెక్కువవాడని వైష్ణవుడును, విష్ణువునకు శివుడు చక్రమునిచ్చెను గాన శివుడే యెక్కువయని శైవుడును వాదమాడుదురు. కాని దానితో మనకేమి? ఆయా పనుల నెరవేర్చ నపుడుభయులు నొకరికొకరు లొంగుదురు. తత్వవిచారసమయమున నిద్దరకు నద్వైతమే.

ప్రాతర్మధ్యందినే చాప్యహ నివిరమితే యత్రిభేద్యాది కాని ।
ఘుష్యంతే రామచంద్రప్రభు కులవియత ప్రాభవద్యోతనాయ ।
యస్మిన్ శ్రీరంగనాథోవసతి విరచితే సోదరత్నే ప్రియాభ్యాం ।
నామ ప్రత్యంతశైలశ్రియమిహ యమునేశం సర్వతోయస్య పూర్వ॥104

తా॥ త్రిసంధ్యలయందును రాముని దేవాలయము ముందర రాజచిహ్నముగా మ్రోగించు వాద్యములు ఏగుట్టపైని వాయించబడు నో రామాలయమునకు దక్షిణమునయున్న యీ గుట్టపైని రంగనాయకులు యిద్దరాండ్రతో రమ్యమగు దేవళమున సుఖముగ నుండును. దానిచుట్టు నూరున్నది.

—♦ వేంకటరమణ హరిదాసుగారి యన్నసత్రము. ♦—

శ్రీరంగేశ్వర శైల దక్షిణతటే విహారయాలంకృతే।
శ్రీమద్వేంకటశబ్దపూర్వ రమణ ప్రఖ్యాత ధర్మాలయః ।
ఆస్తే లక్ష్మణ మైథిలీసహచరో రామశ్చకాత్యాయనీ ।
పూజ్యంతే పురహాచయత్రిసతతం నిత్యాన్నదానస్థలే ॥ 105

తా॥ రంగనిగుట్టకు దక్షిణమున నొకవీధికలదు. అందు స్మార్త బ్రాహ్మణుల యిండ్లును, ప్రసిద్ధులు వేంకటరమణ హరిదాసుగారి యన్నసత్రమును కలవు. ఆసత్రమున నొక పంచాయతనశివాలయము కలదు. మఱియు సీతారామలక్ష్మణులును జగదంబయు నా నిత్యాన్న దాన స్థలమున బూజింపబడుచుందురు

ఏతావతానన్వనుమేయమస్య ।
మనోబలం శ్రీరమణాభిధస్య ।
యాచ్ఞాంవినా ప్రత్యహమన్నమద్ధా ।
సహస్రశో ఽ న్నాతురకోటయే ఽ దాత్ ॥ 106

తా॥ ఆ వెంకటరమణ హరిదాసెవ్వరిని యాచింపకయే ప్రతి దినమున నన్నిజాతుల యన్నాతురులకును నన్నముబెట్టుచుండుటచే నా మహనీయు డెంత మనోబలముకలవాడు యనితోచును.

నూనం జన్మాంతరవితరణం సూచయత్యత్ర జన్మ ।
న్యైవం యాచ్ఞావిరహిత మహద్వ్యన్నలాభోజనస్య ।

నో చేదేవం కథమనిశం నైష్ఠికబ్రహ్మచారీ ।
దైన్యహీనాత్వా ధనమధికమే దన్నదానాయశక్యాత్ ॥ 107

తా॥ "పుట్టినవానికి పుట్టుట చేనాక్షి" యనుసామెత యీమాన నీయుసివంటి వారలందు వెలువడియుండును. కాకున్న నీ నైష్ఠికబ్రహ్మచారి యాచ్ఞాదైన్యము లేకుండ వేలకొలది జనుల కన్నదానము నెట్లు చేయగలిగెను ?

కిం చాత్యంతమత్యద్భుతం స్ఫారమేనో ।
రామస్యార్థే కారితో మండపో౽త్ర ।
వాకాయాలం పాత్రజాతం ప్రభూతం ।
యత్సాహస్రబ్రాహ్మణానాం సకృచ్ఛ ॥ 108

తా॥ మఱియు నీ బ్రహ్మచారి రామునికై యిచ్చట గట్టించిన మండపమును, కళ్యాణోత్సవసమయమందు జేయు సంతర్పణకు సంపాదింపబడిన పాత్రసామగ్రియు నాశ్చర్యమును గలిగించును. ఏలన, నీ రెండు పనులును జమీందారులవంటివారు చేయదగినవే !!! ఆ పాత్రసామగ్రి యొక్కసారి వేయిమందికి వంటకు సరిపోవును.

శ్రీమానధ్యయనోత్సవేషు నృహరేః । రామోఽనన్తాననోవపుః
వైకుంఠాఖ్యమహోత్సవే ప్రచలితే । చైకాదశీపర్వణి
అన్యస్మిన్నపిరాత్రిపర్వదివసే । నిత్యాన్నదానస్థలే
విభ్రాజచ్చతురశ్రమండపతలే । విశ్రమ్య యాతిచ్ఛయా ॥ 109

తా॥ ఆ మండపమునకు శ్రీరామచంద్రప్రభువు అధ్యయనోత్సవములలో నరహరిరూపుదాల్చిననాడును, ముక్కోటిఏకాదశినాడును, రాపత్తు ఉత్సవములలో నొకనాడును స్వస్వరూపముతోడను వచ్చి కొంచెము విశ్రమించి తనయిచ్చవచ్చినట్లు బోవుచుండును.

కళ్యాణోత్సవవాసరేషు మిళతా మన్నాతురాణాం నృణాం ।
సత్రాగారమిదం క్షుధేఽపివిపులా స్నానాయసాగాతమా ।

సస్నాతానాముది చైత్రమాసమిహిర క్రూరార్చిషాతప్తతాం ।
హాహాకార రవంతదాప్రచలితం కోవాకథంవారయేత్ ॥ 110

తా॥ సీతాకళ్యాణోత్సవ సమయమున స్నాతులై వచ్చిన వేలకొలది జనుల భోజనమునకీ సత్రమును, స్నానపానాదుల కావిమల సలిలయగు గౌతమియు లేనన్న నప్పుడు చైత్రమాసపు యెండకు పరితపించు జనులలో గలిగిన హాహాకారము నెవడెట్లు వారించును.

స్మార్తబ్రాహ్మణబృందగేహనిచయః స్తస్మాత్పరం వర్తతే ।
మూలస్థాపిత వాయుసూనునిలయః శ్చాశ్వత్థశాఖీమహాన్ ।
చక్రాకారకృతాధిరోహా విలసితశ్శశ్వజ్జనైస్సేవితః ।
శాఖావ్యూహనివిష్టపక్షినివహై రాకూజితోఽస్త్యేకతః ॥ 111

తా॥ ఆ సత్రముతర్వాత నావీధిలో స్మార్తబ్రాహ్మణుల యిండ్లును, చక్రాకారముగ నరుగుగట్టి మొదట నాంజనేయుని బ్రతిష్ఠించిన యొక రావిచెట్టును గలవు. ఆ యరుగుపైన జనులు గూర్చుండి కోలాహలము జేయుదురు. చెట్టు కొమ్మలపై పక్షులు కలకలముచేయును.

అశ్వత్థవృక్షోత్తరదిగ్విభాగే । వీధ్యాంస్థితాయాం ద్విజగేహమధ్యే
పాల్వంచరాష్ట్రాధిపతేశ్చ కాస్తి । గృహం విశాలం బహువాసయోగ్యం ॥ 112

తా॥ అరావిచెట్టున కుత్తరముగ నున్నవీధిలో బ్రాహ్మణుల యిండ్లనడుమ పాల్వంచ రాజావారి బహుజనవాస యోగ్యమగు గృహము కలదు.

## —♦ ప్రసన్నాంజనేయులు. ♦—

గోదావర్యాస్తటమను మహత్తింత్రిణీ పాదపానాం ।
శశ్వన్మార్గశ్రమ ముపగతై స్తైర్థికై స్సేవితానాం ।
ప్రాంతే భక్తప్రవరరచితో వాయుసూన్వాలయోఽస్తి ।
యస్యాప్రాంతే జనతతికృతే నిర్మితా ధర్మశాలా ॥ 113

తా॥ సూర్యవీధికి పడమటికొనను గోదావరియొడ్డున పెద్దపెద్ద చింతచెట్లుండును. ఆచెట్లక్రింద మార్గశ్రాంతులగు వైదేశికులెప్పుడు శ్రమదీర్చుకొనుచుందురు. ఆచెట్లప్రక్క నొకభక్తుడు ప్రసన్నాంజనేయుల యాలయము గట్టించెను. దానిప్రక్క నొక ధర్మశాల కలదు.

యః ప్రాతినిధ్యేంగ్లనృపాలకస్య । స్థితోపినిర్గర్వ శిరోవిభూషా
మైత్రీమతానీదపిబాలకేన, ప్రదర్శయన్ కార్యవిధౌ స్వశౌర్యం॥114

తా॥ నిర్గర్వశిరోమణియైన యేమహనీయుడు తాను డిప్యూటీ కలెక్టరు పదవినున్నను నూరిలోని పిల్లవానితోగూడ మైత్రిచేసెనో కార్యవిధియందు మాత్రము స్వశౌర్యమును జూపెనో.

మరూరు లక్ష్మీనరసప్పనామా । మంత్రీశ్వరో నందవరీక శాఖి
గోదావరీ రమ్యతటప్రదేశే । స వాయుసూనో రకరోత్ప్రతిష్ఠాం॥115

తా॥ నందవరీకశాఖీయుడగు మరూరు లక్ష్మీనరసప్ప యను నా మంత్రిశేఖరుడు గోదావరియొడ్డున నీ ప్రసన్నాంజనేయాలయమును గట్టించెను.

యస్మాద్రామమయం ప్రపంచమఖిలం పశ్యత్యసౌ మారుతిః ।
తస్మాల్లోచనగోచరత్వమయతాం జీవాత్మనాం వందనం ।
దుర్వారాంజలిబంధనేన సతతం లోకస్యబోధాందిశ ।
త్యేవం నమ్ర ఉపైష్యతి త్రిభువనాదాన్నత్య మిత్యం తతః ॥ 116

తా॥ ఆ ప్రసన్నాంజనేయులు ప్రపంచము నంతను రామమయ ముగ జూచును గాన కంటికిగనపడు జీవులకెల్ల వందనము జేయుచున్న ట్లంజలిఘటించి ఇట్లు నావలె నమ్రుడగువాడు చివరకు ముల్లోకములకు నధికుడగునని లోకులకు బోధించుచుండును.

భవిష్య త్సురజ్యేష్ఠభావస్యచిహ్నం ।
ప్రసన్నత్వమేవేతి లోకస్య శంసన్ ।

ప్రసన్నాంజనేయః ప్రభావం నిగీర్య ।
ప్రకాశం నమస్కార మేవాతనోతి ॥ 117

తా॥ నా భవిష్యద్బ్రహ్మత్వమున కీ ప్రసన్నత్వమే గుర్తని లోకులకు బోధించుచు ప్రసన్నాంజనేయులు దనప్రభావము నంతను దాచి ప్రకటముగ నమస్కారమే జేయుచుండును.

## —♦ గోదావరి. ♦—

రంగత్తుంగతరంగసంగతఘనా వర్షాసుయా జృంభతే ,
సైషేయం కృశతాం ప్రయాతి సురభౌ గోదావరీనిమ్నగా ।
లోకే సంపదుపాగమస్యచలతాం సంసూచయంతీ తథా ।
కాలేకష్టదశానివార్యతమతాం లోకస్య దృష్ట్వాం తతః ॥

తా॥ వర్షాకాలమున తరంగములతో మేఘముల నందుకొను నట్లున్న గోదావరి గ్రీష్మకాలమున కృశించి లోకమునకు సంపదాగమ మస్థిరమనియు నెంతవారికైన కష్టకాలమున కష్టములనివార్యములయు బోధించుచుండును.

క్వచిన్నక్రకరభీకరా హ్రదతలాః క్వచిన్నీరజై-
ర్వ్యతాసితమణిప్రభైః పరివృతా మహాప్రస్తరైః ।
క్వచిజ్జలవిహంగ మీఝషకృతే తపస్తత్పరైః ।
ద్విజాళి జలగాహనైస్తపసి గౌతమీ శోభతే ॥ 119

తా॥ ఒకదిక్కున మొసళ్లచే భయంకరములగు మడుగులతో ను, ఇంకొకదిక్కున సరసనీరజములతోడను, మఱియొకచోట నిండ్ర నీలములవంటి నల్లని రాళ్లతోడను, వేరొకచో చేపలకై జపము చేయు పక్షులతోడను, బ్రాహ్మణుల యవగాహనస్నానములతో నింకొక స్థలముననూ.

క్వచిల్లలితకేరళీచికురభంగి భంగాన్వితా ।
క్వచిత్కుసుమభాసురైః స్సరసవేతసైర్గుంఫితా ।

క్వచిద్యువతివేణికా సదృశ నీరసద్వేణికా ।
విలోచన మహోత్సవంచరికరీతిసాగౌతమీ ॥ 120

తా॥ ఇంకొకచోట మళయాళాంగనల చికురములపగిదినున్న చిన్నచిన్న తరంగములతోడను. వేరొకతావున పూచిన పొబ్బచెట్లతోడను, నింకొకతావున యువతుల జడవలె సన్నని జలప్రవాహము తోడను.

క్వచి చ్చడుగుడు స్వనైర్ముఖరితతర ధిక ధావతాం ।
ప్రదోషసమయాగతై స్సహృదయై క్రీడతాం ।
విలాసికలితోచితుల పౌరయూనాంగణైః ।
అలంనయకౌతుకం దిశతి సంయుతా గౌతమీ ॥ 121

తా॥ సాయంకాలమున చెడుగుడుగుడనుచు విశాలములగు నిసుకతిన్నెలపై నగుగులిడుచు స్నేహితులతో నాడుకొను పౌరబాలుర గుంపులతోడను వేసవిని గౌతమి కన్నుల పండువుగా నుండును.

## —♦ పునర్వసు మండపము. ♦—

పునర్వసుమహోత్సవే ప్రభుగృహీతియం మండపం ।
సదాశిశిరగౌతమీ పవనపోత సంసేవితం ।
చకాస్తి కిల మండపో వరదయాఖ్య ధర్మాలయ ।
ప్రభంజనసుతాలయప్రవర మధ్యదేశేమహాన్ ॥ 122

తా॥ వరదయ్యగారి సత్రమునకును ప్రసన్నాంజనేయాలయమునకును మధ్య పునర్వసు మండపమున్నది. స్వామియందు ప్రవేశించినపుడు చల్లని గౌతమీ మారుతము సేవించును.

సమీరణమహానటో విమలగౌతమీవారి స ।
త్స్ఫురందరమణిస్ఫుర ద్వీపులరమ్య రంగస్థలే ।

తరంగనినదచ్ఛలా ద్దధిగిణేతిశబ్దాన్వదన్ ।
పునర్వసు మహోత్సవే రఘుపతిం సదా సేవతే ॥ 123

తా॥ గాంచఁదద్రిప్రభువు పునర్వసు మండపమున వేంచేసిన ప్పుడు గౌతమీ నదీ ప్రవాహమను సింహాసనవిశాల రంగస్థలమున వాయువను మహానటుఁడు తరంగధ్వనులమిషతో దధిగిణయను శబ్దముల బలుకుచు నటించి స్వామిని సేవించుచుండును.

పునర్వసుమహోత్సవేచలతి గౌతమీరోధసి ।
క్షితిపతిసవ లక్ష్మణార్యసుఖలోద్వహాపస్ఫుర ।
న్ముఖాంబుకణనామకాంబుజరసం సమీయస్వకం ।
సమీరణకిశోరక స్స్ఫుటయతి ద్విరేఫాయితం ॥ 124

తా॥ గౌతమీతీరమున పునర్వసు మండపమున మహోత్సవము జరుగుచుండ సీతారామలక్ష్మణుల ముఖపద్మములనున్న స్వేదకణ మకరందమును పానముజేసి సమీరకుమారుఁడు తన ద్విరేఫత్వమును స్ఫుటపరచుచుండును

నరసింహనివాసభూధర । క్షితిజాజాని మహీధరాంతరే
ప్రహరస్తి సమృద్ధజీవన । స్సరతః నాగర జీవనాశ్రయః ॥ 125

తా॥ నరసింహస్వామి గుట్టకును, రాములవారుండు గుట్టకును నడుమ నొక భక్తునిచే త్రవ్వింపబడి యెన్నఁడును వట్టిపోక నాగరజీవనాధారమగు నొకబావి కలదు.

భద్రాద్రే శ్శిఖరాదుదగ్విరచితా త్సోపానమార్గాత్పునః ।
కూపః ప్రాచివిరాజతే మధురవాః పూరః పురాఖానితః ।
సీతారామ ఇతిద్విసామకలితే నాచార్యవర్యేణయో ।
ధర్మాన్యైవజనై స్సదా తదుదకం సద్వీవధైర్నీయతే ॥ 126

తా॥ భద్రాద్రిపైనుండి యుత్తరముగ దిగుటకు కట్టించిన సోపానములకు తూర్పున తియ్యని నీరుగల యొకబావి యున్నది. సీతారా

మాంచాగ్యులను నొక పురవాసి ధర్మార్థమై యానూతిని చిరకాలము క్రింద త్రవ్వించెను. దానినుండి కావళ్లతో నీరు గొనిపోవుచుందురు.

## —♦ తులసీవనము. ♦—

సీతాకాచన తత్రయః ప్రతిదినం నీత్వాఘటేనస్వయం ।
శ్రీరామార్చన కారణాయ తులసీ సత్కాననం సించతి ।
శూద్రైవం తులసీదళార్చనవిధౌ సాహాయ్యమాతన్వతీ ।
జానేయాస్యతి యజ్ఞ దాననిరతైర్గమ్యంపదం శ్రీహరేః ॥ 127

తా॥ ఒక శూద్రవృద్ధ ప్రతిదినమునను నా నూతినీరు కడవతో తెచ్చి యా యుత్తర సోపానములకు పడమటనున్న స్వామివారి తులసి తోటకుబోసి పెంచును. ఇట్లు స్వాముల తులసీదళపూజలకు సాయము జేయు పాదజాంగన యజ్ఞదానాదుల నాచరించినవారు బొందు శ్రీహరి పదమును బొందుననుకొనెదను. దాని పేరు సీత.

తులసీవనపోషణేనసా । కిము న ప్రాప్స్యతి వైష్ణవం పదం
గరుడోపల పూజనాద్యత । స్తులసీపూజ నమిష్యతే హరేః ॥ 128

తా॥ గరుడపచ్చలతో పూజించినదానికన్న తులసీపూజచే శ్రీహరి యెక్కువ సంతసించును కాన నీవిధమున తులసీపూజలకు సాయముజేయు నావృద్ధ వైకుంఠము నేలపొందదు?

శుకపత్ర సమాన కాంతి మ । త్తులసీకానన దర్శనంతు యః
విదధాతిసజాతుపశ్యతి । హ్యసి పత్రాహ్వాయ కాననం జనః ॥ 129

తా॥ మఱియు శుకపత్రములవలె కన్నులపండువుగా నుండు తులసీవన దర్శనముజేయువాడెన్నడును నరకములోనుండు అసిపత్రమును జూడఁడు గదా.

నాల్గుస్తంభాల మండపమున సీతారాములు వనవిహారము చేసి వచ్చి కూర్చుండి మందమారుతమును సేవింతురు.

ఆలవాలవలయైరలంకృతాః । మల్లికాముఖలతోపవేష్టితాః
పుష్పవృక్షనిచయాన్ససేచితాః । వీక్ష్య తృప్తిమివాన్నైతి రాఘవః॥ 134

తా॥ చక్కని పాదులుగల పుష్పవృక్షముల మల్లెలు మొదలగు తీగలు చుట్టుకొనియుండును. ఎల్లప్పుడును తడుపబడి నవనవలాడు ఆచెట్ల నెంతసేపుచూచినను రాముని తనివితీరదు.

ఘటీయన్త్రోన్నీతం కలుషమమలం చాపి సలిలం ।
స్వయంపీత్వా యల్లాంగలతనుసయూనాస్స్వశిరసా ।
సుధాతుల్యం తోయం ఘటసముఫలానాం సముదయే ।
దధానో లోకార్థకం సుజనసమతాం చాత్రవహతి ॥ 135

తా॥ అందరికొబ్బరచెట్లు తాము మురికినీరో మంచినీరో మోట తోలి పోయగా త్రాగి స్వల్పోపకారము నొందిన సుజనులవలె లోకమునకు ఘనోపకారము చేయుటకై కడవలంత బొండ్లములతో నమృత తుల్యమగు నుదకమును ఎప్పుడు శిరమున బెట్టుకొని యుండును.

కుల్యాసు కేరళసతీ చికవాళితుల్య ।
భంగం సదావహతి యత్రజలం సలీలం ।
రమ్యాలవాలకలితా అభితోరసాలా ।
మల్లీలతా స్సరసకేసర సంగతాశ్చ ॥ 136

తా॥ పిల్లకాలువలలో కేరళీచికుర తుల్యములగు చిన్న చిన్న తరంగములతో నీరు పారుచుండును. తియ్యమామిడిచెట్ల పాదులు బలు సొంపుగ నుండును. మల్లెతీగ లక్కడి చక్కని పొగడల కెగబాకును.

యస్యావృతిర్లసతి కంటకసంయుతాభిః ।
తస్వీభిరాయసలతాభిరలంపిక్లిప్తా ।
యత్రాస్తిపోషిత సమస్తలతానురూపాః ।
కూపః ప్రమోద జనకో జనలోచనానాం ॥ 137

తా॥ ఆయుద్యానమునకు నన్ననిమునిముఖ్యులుగలవారు నావరణము జేసిరి. అచ్చట నీ పూలచెట్లకు జీవనాధారము చూచుటకును కింపగు నొక బావి కలదు.

యస్మాత్కోకలవంశజాతవనితా దత్తం హి తాళీఫలం ।
శ్రీరామప్రభురాదదే ప్రతిదినం భోగాయ తాళీవనం ।
తస్మాద్రామహితాయ చేత్యధిగత ప్రజ్ఞానిశేషైరవ ।
పుంభిః పుష్పవనే సమంతరువరై స్తాళీవనం వర్ధ్యతే॥ 138

తా॥ పోకల దమ్మక్క నివేదన చేసిన తాటిపండును శ్రీరామచంద్రులు ఆరగించిరి గాన తాటితోట యాదేవునికిష్టమనుకొని కాబోలు ఆయుద్యానమున నొకప్రక్క తాటితోటను పెంచిరి.

ఫలాని తాళీ వనజాసపీతా । రామప్రభోస్సంతు నవా భవంతు
భోగాయ తాళీదళసంచయస్తు । చైత్రే ప్రపాసాధనతాముపైతి॥ 139

తా॥ ఈ తాటిచెట్లపండ్లు రాములభోగమున కుపయోగించినను లేకున్నను వానియాకులు మాత్రము చైత్రమాసమున చలవపందిళ్ళ కుపయోగపడుచున్నవి.

పత్రంవాపి సుమంఫలం యదపి వా తోయం యతాత్మాత్మయః ।
భక్త్యాయచ్ఛతి మేఽద్మి తత్ప్రియతరం నాస్మాత్పరం ప్రీతిదం ।
ఇత్యాజ్ఞాం మనసాస్మరన్ సభగవాన్ స్వస్యైవ జగ్రాహ తత్ ।
తాళం మానమిహాన్యథాఽత్ర జగతామీశస్య కిం దుర్లభం ॥ 140

తా॥ "పత్రంపుష్పం ఫలంతోయం యో మేభక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః" పత్రమో పుష్పమో ఫలమో లేక వట్టినీళ్ళో యెవడు భక్తితో నాకర్పణచేయునో దానిని అతిప్రీతితో దింటును అని తానే భగవంతుడనెను గాన భక్తితో దమ్మక్క యర్పించిన తాటిపండును స్వామి దినెనుగాని యాజగన్నాయకునకు లేనిలేక తాటిపండు దినెను?

## కచ్చేరీలు.

కళ్యాణమండప కుబేరదిశా ప్రదేశే ।
సంత్యాంగ్లభూమిపతి కార్యగృహాణిభూయః ।
తత్రైవచ ప్రతినిధే ర్గృహమస్తిరాజ్ఞః ।
ఆరక్షకాధిపగృహా ప్రభృతీనిసంతి ॥ 141

తా॥ కళ్యాణమండపమునకు నుత్తరముగ సింగ్లీషువారి కచ్చేరీలన్నియు నున్నవి. రాజప్రతినిధిభవనమును పోలీసు సూపరింటెండెంట్ బంగాళాయును నాప్రైపుననే యున్నవి.

శ్రీమద్భద్రాచలపుర బహిఃప్రాగ్దిశి భ్రాజమానం ।
వైద్యాగారం లసతిసుభగం హ్యాంగ్లభూపాలకస్య ।
యస్యప్రాంతేవసతి విపులహ్యాంగ్ల విద్యాపరాణాం ।
విద్యాశాలా వివిధకులజైః పూరితాబాలబృందైః ॥ 142

తా॥ భద్రాచలమునకు తూర్పుదిశను ఆంగ్లేయ వైద్యశాలయు, నన్నికులములవారును జదువుకొను నాంగ్లపాఠశాలయు గలవు.

విహారభవనం లసత్యవిరతం విహారాగతైః ।
పురేత్రపురవాసిభి ర్వివిధపత్రికాపాఠకైః ।
ప్రకీర్ణమపి కందుకప్రముఖసాధనైః ఖేలతాం ।
నృణాం లలితభాషిత ప్రహసితస్వనైః పూరితం ॥ 143

తా॥ భద్రాచలమునందలి విహారభవనమున (క్లబ్) నూరివారిందరు సాయంకాలమునజేరి కొందరు నానావిధ పత్రికలను జదువుదురు. కొందరు బంతులు మొదలగు సాధనములతో నాటలాడుదురు. మఱికొందరు చిత్రవిచిత్రకథలను హాస్యములను చెప్పుకొనుచు కోలాహలము చేతురు.

వర్షేవర్షే విజయదశమీ పర్వణిభ్రాజమానే ।
రామస్సీతానుజసహితో జైత్రయాత్రాం విధాయ ।

యస్మిన్ విద్యాలయవరిసరే రాజతే మండపోన్యః।
సోయం వైద్యాలయ యమదిశి ప్రోన్నత స్తంభయుక్తః॥ 144

తా॥ ఏటేటను విజయదశమినాపండుగకు రాముడు పారువేటకు బోయి విజయంచేయు మండపము వైద్యాలయమునకును నాంగ్లపాఠశాలకును సమీపమున నున్నది.

—♦ వారాంగనలు. ♦—

కించానంగ ప్రబలజగతీరాజ్య సర్వస్వ భూతాః,
వీక్షామాత్రాపహృత మదనా మోఘపుష్పేషు గర్వాః।
వీథ్యాం వీథ్యాం విగళితయువశ్రేష్ఠ మత్తేభసంఘాః।
భద్రాద్ర్యాఖ్యే నిగమతిలకే వారముఖ్యాశ్చరంతి॥ 145

తా॥ భద్రాచలమున నన గరాజ్యసర్వస్వాత్తై నయనప్రసారమాత్రమున యువ మదగజముల సంకెళ్లు వేయు వారముఖ్యలు ప్రతివీధియందున దిరుగుదురు.

గమనేషు విశేషచాతురీం। గణికాశ్శిక్షితవత్య ఏవ తాః।
పురసంచరణేషు కాననా। ధిక్కృతానాం మదదంతివర్గతః। 146

తా॥ వనశాఖాధికారుల యేనుగు లూరదిరుగుచుండ జూచి యూయూరిగణికలు నడకల చాతుర్యమును నేర్చుకొనియే గజగమన లనబడుదురు.

భద్రాచలే భాసురదృష్టిపాత్రై। వీథీషువీథీషు విలాసినీనాం
వినాపరాధం బహుశోయువానః। సర్వేప్యహో శృంఖలితాభవంతి॥ 147

తా॥ భద్రాచలమున నిరపరాధులగు యువకులు ప్రతివీధియందును విలాసినుల యపాంగవీక్షణములను గొలుసులతో కట్టవేయబడుచున్నారు.

భక్తైర్భద్రాచలపురమభివ్యాప్య రమ్యానిబద్ధాః।
సీతాభర్తుస్సరసవసనకృతే మండపా స్తత్రతత్ర।

పౌష్యే రామోదశసుదివసేష్వేక మేకం స్వరూపం,
ధృత్వాసీతానుజ సహచరైర్యేషు లీలాస్తనోతి ॥ 148

తా॥ అనేకులు భక్తులు భద్రాచలమున నన్నివైపులను నక్కడక్కడ మండపములగట్టించిరి. పుష్యమాసమున పదిదినములు స్వామి ఒక్కొక్క రూపముధరించి ఆ యా మండపములయందు వేంచేయును. అక్కడ హరికథాదులు ప్రతిదినమున జరుగును.

—♦ ఆవులు లేగలు. ♦—

ప్రాతఃపీతాః బద్ధవత్సానిచయా గత్వావనాయ్యాంజసా ।
ఆసాయం యవసాయగోపనివహై ర్ఘాటాద్యగావోవనే ।
సాయం సంస్మృతవత్సకా స్స్రుతపయఃపూరోధసస్సత్వరం ।
ధావంత్యః పురబాహ్యఏవకలితాః ప్రత్యుద్గతైర్వత్సకైః ॥ 149

తా॥ భద్రాచలమున నావులు లేగలు పాలుతాగిన పిమ్మట నడపికిబోయి మేతకై గోపకులతో నచ్చటచ్చట సాయంకాలమువరకు ను దిరిగి ప్రొద్దుగ్రుంకువేళ లేగలు జ్ఞాపకమునకురాగా పొదుగులుచేప గా త్వరతో బరుగునవచ్చి యూరివెలుపలనే యెదురువచ్చిన లేగలతో గలిసికొనుచుండును.

సాయం భద్రాచలపరిసరే సంఘశో బాలవత్సాః ।
హాంభారావైః ప్రతిపద సమాహూతగావశ్చరంతి ।
ఆపీనానాం పృథుతరతయాహో త్సుకాశ్చాపిగావః ।
మందం మందంచరితయవసాః కాననాచ్చంక్రమంతే ॥ 150

తా॥ మఱికొన్ని చిన్నలేగలు నూరివెలుపల కొంత ప్రొద్దుండ గనే గుంపులు గుంపులుగాచేరి అమ్మాయని యడుగడుగున కఱచుచు తిరుగుచుండును. కొన్ని యావులు మరులుగలిగినను పొదుగుల బరువు చేతను కడుపునిండ మేసియుండుటచేతను పరుగిడలేక మెల్లమెల్లగా నడవినుండి నడచివచ్చును.

శ్రుత్వావత్సధ్వనిమథపయస్స్రావయుక్తోధసోలం ।
ఊధోభారాత్కధమపి వదాన్యాశుసంచారయంత్యః ।
వత్సాహూతిం ద్రుతతరమమూః కుర్వతేహుంరవేణ ।
జ్ఞాత్వామాతుర్ధ్వనిమలమమీధావితుంప్రారభంతే ॥ 151

తా॥ మెల్లమెల్లగ నవివచ్చు సమయమున కొంతదూరమున నె
లేగలపిలుపు విని బరువులగు పొదుగులు గలుగు నాయావులు బల
వంతముగ నడుగుల త్వరగా నిడుచు పమ్మని బరువులుపలుకుచు దాని
విని గుర్తించి లేగలు తల్లులకెదురుగ వచ్చి కలియుచును.

దృష్ట్వామాతుస్తబ్ధకర్ణం స్వరూప ।
ఘ్రాత్వా[…]లూమ సంచాలయంతః ।
ఉత్క్షిప్యోర్ధ్వః క్షీరపానే ప్రవృత్తాః ।
కేషాం నస్యుః ప్రీతయే బాలవత్సాః ॥ 152

తా॥ అట్లు పరువెత్తుచు వచ్చి చెవులు నిక్కబట్టి తల్లులవంక
జూచి యుత్సాహమినుమడింప నెగురుచుబడి తోకలాడించుచు కుమ్ముకుమ్ము
పాలుద్రావు నాచిన్నలేగల జూచువారికెవరి కానందము గలుగదు?

## —♦ బడిపిల్లలు. ♦—

క్రీడాలోలాః కరతలగతైః పుస్తకైస్సంచరంతః ।
తాస్తాః క్రీడామనసిసహితాః శ్లాఘయంతస్సమిత్రైః ।
ప్రాతర్గోష్ఠాద్రవిఘటనాన్నిస్సరద్వత్ససంఘైః ।
తుల్యం శాలాస్త్వహరుపరమే పాఠశాలాం త్యజంతి ॥ 153

తా॥ సాయంకాలమున భద్రాచలపు బడిపిల్లలు చేతుల పుస్త
కములబూని యాటలయందలి యుత్సాహముతో దమయుత్తమ మిత్రుల
తోడ నాడబోవు నాటల శ్లాఘించి చెప్పుచు నుదయమ్మున లేగల
కొట్టముల తలుపులుదెరువగనే బయలువెడలు లేగలవలె నాత్రముతో
బడినుండి బయలువెడలుదురు.

## —♦ ప్రదోషములు ♦—

శశ్వద్భద్రాచలపరిసరే సంగతానాం బహూనాం।
గోవత్సానాం బహువిధరవైర్గోపశృంగ స్వనైశ్చ।
సంధ్యాపూజాసమయ విచరద్భేరికాధాం నినాదైః।
నిత్యం సద్భిర్ద్విజకులరవైస్సంకులాహి ప్రదోషాః॥ 154

తా॥ భద్రాచలమున ప్రదోషములెల్లపుడు నూరిబైట మేసి కొనిన గోవత్సముల నానావిధరవములతోడను, సంధ్యాపూజాసమయమున మ్రోగించు భేరీఢాంకారములతోడను, గూళ్ళకుచేరు పక్షుల కిలకిలములతోడను సంకులములై యుండును.

సాయం సంధ్యాచరణమిషతః స్నాతుకో భద్రశైలే।
గోదావర్యాం జలవిహరణం కుర్వతే విప్రడింభాః।
నైతచ్చిత్రం తపసి మిహిరక్రూర కాంతి ప్రతప్తా।
స్థానాన్నక్రా బహిరుపగతాస్స్థిరమేవాశ్రయంతే॥ 155

తా॥ వేసవి భద్రాచలపు విప్రడింభకులు సంధ్యావందనమునకని పోయి గోదావరిలో నీరులాడుచుందురు. ఇదియొక చిత్రము కాదు. ఎండ వేడికి కాగిపోయినసీట నిలువలేక మొసళ్ళు మడుగులనుండి బయటికివచ్చి పడియుండి యెందరువచ్చి చూచినను కదలవు.

గ్రీష్మే భద్రాచలపరిసరే గౌతమీ నీరమధ్యే।
చిత్రం పద్మాన్యహరు పరమేవ్యాశ్రయంతే వికాసం।
యేషాం పార్శ్వే విఘటనభిమే వైత్యకంపం వహంతః।
ద్వంద్వీభూతా శ్శరణవరణం కుర్వతే చక్రవాకాః॥ 156

తా॥ గ్రీష్మకాలమున భద్రాచలమువద్ద గోదావరీప్రవాహమున నొకచిత్రము జరుగును. ఆచిత్రమేమన:-ప్రొద్దుగ్రుంకు వేళ పద్మములు వికసించును. మఱియు వియోగభయమువలనగాబోలు వణకుచు జంటలుగా చక్రవాకములాపద్మముల శరణుజొంది యుండును. (స్నానము జేయు స్త్రీల ముఖములును స్తనములు నిట్లు వర్ణింపబడినవి.)

సాయంకాలే పశుసముదయః పంక్తిశో నీరపానం ।
గోదావర్యా మనుదినమలం సైకతే యాతికర్తుం ।
మందం మందం జలఘటధరా యోషితశ్చంక్రమంతే ।
తీరాన్నీరాత్తపసిసికతే చంద్రికాతుల్యకాంతౌ । 157

తా॥ భద్రాచలమున వేసవిని ప్రొద్దుగుంకు వేళల పశువులు నీరుద్రాగుటకును నీళ్ళు తెచ్చుకొనుటకు జలఘటధరలై వనితలును ఒడ్డునుండి వెన్నెలవలెనున్న యిసుకమీదుగా నీటివరకును నీటివద్దనుండి యొడ్డునకును కులుకుచు నడయాడ కన్నులపండువగును.

సర్వే భద్రాచలపురజనా గ్రీష్మకాలేషు సాయం ।
గోదావర్యాం జలవిహరణజాతహాసాః ప్రయాంతి ।
తేనైవైతే విగతదురితా యేతు రామస్య భక్తాః ।
నిత్యంస్నాత్వా దశరథసుతం కిం పునస్సేవమానాః ॥ 158

తా॥ వేసవిని భద్రాచలవాసులందరు సాయంకాలమున గోదావరియందు జలవిహారణము వేసి సంతసముతో నిండ్లకేగుదురు. ఆ కారణమున వారి పాపములు పరిహారమైపోవును. నిత్యమును స్నానముజేసి రాముని సేవించు భక్తులజెప్పనేల ?

తస్మాద్భద్రాచలమితిపురం పర్వతశ్చాపి సుభ్రు ।
క్షేత్రం తీర్థం జగతివిదితం యత్ప్రశస్తం పాపహారి ।
ధన్యాసిత్వం చటులశఫరీ ప్రేక్షణేత్వాశ్రితాసి ।
పూర్ణం భద్రాచలపరిచయం ప్రాపితాచాసి మత్తః ॥ 159

తా॥ కావున నోసుదతీ ! భద్రాచలమునను తీర్థమును క్షేత్రమునై కాశీ గయా ప్రయాగాదులతో సమముగ ప్రసిద్ధిచెందినది. ఓ చంచలాక్షీ! నేజెప్పిన భద్రాచల చరిత్ర నంతను విని ధన్యురాలనైతివి గదా !

శ్రీ

ఏవంపత్యా ప్రణయమధురం శ్రావితా పూర్వగాథా ।
యుక్తం భద్రాచలపురవరం సా ప్రహృష్టాననామ ।

పత్యాః పాదా ద్విజకులవరస్సోపి విద్వాన్ ప్రహృష్టః ।
గాఢాశ్లేషప్రహతవిరహాంతాం చకారాయతాక్షీం ॥ 160

తా॥ ఇట్లు ప్రణయమధురముగ పతి పూర్వగాథలతో గూడ భద్రాద్రిని దెలుప నాసతివిని సంతసమున పతి పాదములబడి నమస్కరించెను. ఆ సరసుఁడును నామెకు విరహతాపముసయిత ముపశమింపఁ గ్రుచ్చి కౌఁగలించుకొనెను.

వేదాంతవంశ్యః శ్రీరామశ్శేష విద్వన్మణేస్సుతః ।
ఆస్థానవిద్వాన్ రామస్య చక్రే భద్రాద్రివర్ణనం ॥ 161

తా॥ భద్రాచలరాముని యాస్థాన విద్వాంసుఁడును వేదాంతం శేషవిద్వన్మణి సుతుండునగు శ్రీరాముఁడీ భద్రాద్రివర్ణనమును రచించెను.

ఇతి శ్రీబ్రహ్మణ్యగణ్య నోరి సుబ్రహ్మణ్య వ్యాకరణాచార్య శిష్య శ్రీరామకృత భద్రాచల పురవర్ణనం

